శ్రీ

# వీరబ్రహ్మయోగి

(నాటకము)





గ్రంథకర్త:

పండిత, ద్రోణంరాజు సీతారామారావు,

---

పీఠిక:

కవిశేఖర, పండిత, వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారు, దుగ్గిరాల.

---

ప్రకటనకర్తలు:

కె. యస్. మూర్తి అండ్ బ్రదర్సు,

తెనాలి.

---



[వెల రు 1-0-0.

**K. S. MURTY & BROTHERS.**
**TENALI.**



Author—D SITHARAMA RAO,
Sree Raja Rajeswari Sadhanam,
TENALI

# వీరబ్రహ్మయోగి

[శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామివారి చరిత్రము:- నాటకము.]

గ్రంథకర్త.





పండిత, ద్రోణంరాజు సీతారామారావు.

తెనాలి రజత ముద్రాక్షరశాలయందు ముద్రితము.

మొదటి కూర్పు.

1926



వెల రు 1-0-0.

# పీ ఠి క.

"యదాయదాహి ధర్మస్యగ్లాని ర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మ స్యతదాఽత్మానం సృజామ్యహం ॥ "

అను భగవద్వచనానుసారముగఁ బ్రపంచమున ధర్మానుష్ఠానము సన్నగిల్లి యధర్మాభివృద్ధియగునప్పుడెల్లను బరమేశ్వరునకు లీలామానుషవిగ్రహమునఁ దానవతరించి సద్ధర్మాభివృద్ధి యొనర్చుట సహజవిలాసము. ఇట్టి భగవద్విలాసమే మున్నూరు వర్షముల మీఁదట దేశమందంతటను మ్లేచ్ఛమతవ్యాపకమున హైందవ మతానుష్ఠానమెడఁబాయుతఱి వేదాంతముఁ బ్రత్యక్షానుభవ మొనర్ప శ్రీవీరబ్రహ్మయోగీంద్రస్వరూపమున నావిర్భవించెను. ఇమ్మహామహుఁడు తన మతమునందుఁ బ్రజావిశ్వాసముగల్గునట్లు దానావిర్భవించినది మొదలుకొని యనంతములగు వివిధమహిమలఁ బ్రదర్శించి యశేషజనస్తూయమాన చరిత్రాత్మకుఁడై వెలుఁగొందె. ఆ చరిత్రపయోనిధిలోని యొకతరంగపంక్తియే, యీ "వీరబ్రహ్మయోగి" నాటకగ్రంథరంగమునఁ బ్రచలితయు వర్ణితయు నయ్యె.

మననాటకములు రంగస్థలములు శృంగారకరుణాద్భుత వీరాది రసముల కునికిపట్లయి చూపఱఁదన్మయతఁ బొందించి వెనువెంటనే స్వప్నసదృశములుగఁ దిరోహితము లగుచుండెడివి. ఎంతయో కాలము నుండినచ్చు నిట్టియాచరణ యీనాటకగ్రంథమున మారి కేవల సుబోధామృతమే వర్షింపఁబడినది. ఈనాటకప్రదర్శనమున సామాజికులకు శాంతయుతమైన భక్తిజ్ఞాన వైరాగ్యము లుల్లసిల్లుననుటలో నతిశయోక్తి గానరాదు. కథానాయకుఁడగు వీరబ్రహ్మయోగి, వేదమతదూరుఁడగు నొకపింజారిశిష్యునాకర్షించి, యతనికద్వైతబోధనొనర్చి,యతనిమతప్రచారము నడ్డగించిన ద్విజవర్యుల యనుమానాంధకారము నడంపఁ దనతేజోమహిమఁ బ్రకటించి, తురుష్కప్రభునంతవానిఁగూడఁ దన

యపూర్వమహిమచే, శాంతచిత్తునొనర్చి, వైరాగ్యముఁబురికొల్పి, తుట్టతుదకు నిర్వికల్పమయిన జీవత్సమాధినొందుటయే యిందలికథాంశము.

ఈ ప్రబంధకర్త "నాటకసరస్వతి" యను పేరుగాంచుటయేకాక "నిరర్గళాద్భుతాకర రసపుంజమంజుల వికస్వరచారు కథాసుధాధురంధరచాతుర్య ప్రబంధకవితా వనితామహితోక్తిసంపదన్ | ధరణి ఖ్యాతిఁ జెందు కవితల్లజుఁడ" గుటచే, నేనట్లు విశేషించి వ్రాసినను జర్విత చర్వణమే యగును. శైలిసులభముగానుండి శ్రోతలకుఁ గర్ణపేయమగుట నిస్సందేహము. ఈనాటకరచనాసందర్భమున, నీకవి ప్రవరుని గూర్చి పెక్కండ్రు పెక్కువిధముల వక్కాణించుట నిక్కమే కాని, జాతిభేదభావము నిమనీషి ప్రకాండుఁడు మొదలంటఁ గోసివేసెననుట యనుమానరహితము. గ్రంథద్రష్టలకెల్లరకు నీవిషయములు తెల్లముగాక మానవు.

కర్తృ భర్తృ ప్రేరయిత లిట్టి గ్రంథములు వృద్ధిపరచుటకు, [illegible]వి సహృదయహృదయంగమ మొనర్చుటకుఁ, గరుణామయుఁడగు జగదీశ్వరుఁడు ప్రేరేపించుచుండుఁగాత !

ఇట్లు,

దుగ్గిరాల, బోర్డుహైస్కూలు — వడ్డెపాటి నిరంజనశాస్త్రి

28—10—26 — పండితుడు.

# ఒక చిన్న మాట.

## ( పీఠిక )

నాటకమంతా చక్కనిభాష. పీఠిక మాత్రము గ్రామ్యమేమిటని నలుగురూ నవ్వకండి. వ్రాయవలెననే వ్రాసినాను. అసలుదీనికి పీఠికే అక్కరలేదనుకొన్నాను. కాని వ్రాయవలసివచ్చింది. కలం పట్టనేర్చుకొన్నవారెల్ల కవులుగానున్న మహానీయులముందు ఇదివరకు మంచో, చెడ్డో 100 గ్రంధాలు వ్రాసినప్పటికీ లేనిభయం యీనాటకం వెల్లడించడానికి కలిగింది. ఈభయానికి గొప్ప కారణమేమయినా వుందనుకొంటారేమో? ఏమీలేదు. రెండు తోహారాలు, రెండు భజనకీర్తనలు, వ్రాసి మేము కవులము మేముశాస్త్రులము మేముశర్మలము మేము గాయకశిరోమణులము మేము హరిదాసులమని వారిలోవారే కులుకు కవి వృషభములనుచూస్తే నాకుభయం "half knowledge is dangerous" (సగం తెలివి అపాయం) అని ఇంగ్లీషులో ఒక సామెత వుంది. తెలివితక్కువవారికి సమాధానంచెప్పడం చాలకష్టం. తెలిసినావుండాలి తెలియకనావుండాలి ఈరెంటికిమధ్యలో తేనెలోపడ్డ యీగలాగ కొట్టుకొనే తెలివితక్కువవాళ్ళకు చెప్పడం నాచేతకాదు. అల్లాంటివాళ్ళు పోనీమనకెందుకని వూరుకోరు. ఇదిగో ఇదితప్పు అని:- ఎవరో నలుగురునిచేర్చి చెప్పడం ప్రారంభిస్తారు. వినేవాళ్ళుకూడా "ఆహా" అంటారు? వాళ్ళదగ్గిరయినా తెలివివుంటే అల్లాటివాళ్ళను నాలుగుచివాట్లుపెట్టారు. కాని వినేవాళ్ళదగ్గిరకూడా మంచిచెడ్డలు విచారించే శక్తిలేదుగా! అది కొనుక్కొన్నా దొరకదు. పాటకుతగిన తాళముకాబట్టి ఇంకనూ నేను వ్రాసేదేమిటంటే నేను ఈనాటకము అల్లాటివాళ్ళుచూచి మెచ్చుకొంటారని వ్రాయలేదు. వాళ్ళు దీనిని మెచ్చడానికిగాని తప్పులున్నాయి అనడానికిగాని అర్హతలేదు. అందుచేత వాళ్ళు వూరికేకూర్చుంటే గౌరవముంటుంది. కదిపితే కంపు. తీగ కదిపితే డొంకంతా కదులుతుంది.

2. పోతులూరు వీరబ్రహ్మముగారంటే మనవేపున విశ్వబ్రాహ్మలకు గురువని ఒకపిచ్చవూహవుంది. ఆయనను వారేగాని మరొకరు

పూజింపరాదని తక్కినవారంటూవుంటారు. నిజం గ్రహించలేరు. అన్నిమతములవారు ఆయన్ని కొలుస్తారు. మహిమవున్న మహాపురుషులు అందరిచేతను పూజింపబడదగినవారే. ఈయభిప్రాయమునే మనస్సులోపెట్టుకొని మత సంబంధమైన పక్షపాతానికి మనస్సులో స్థలమీయకుండా యిది వ్రాసినాను. ఇది వ్రాసినందుకు ఎవ్వరైనా నవ్వుతారాయేమిటి! నవ్వితేనవ్వండి! మెచ్చుకొంటే మెచ్చుకోండి దానికి విచారించను దీనికి సంతోషించను. నాకంతా ఒకటే.

మరొక విశేషము:— నాటకం వ్రాతపూర్తి అయ్యేటప్పటికి కృతిపతి తలవనితలంపుగా లభించినాడు. నాకావ్యకన్యలు సాధారణంగా డబ్బుకాసపడరు. వరుని గుణమే చూస్తారు ఆశలేనివాడికి డబ్బు తానంతటదే వస్తుంది. అందుకనే తగినవాడని కొల్లూరు కాపరస్తులు శాంతగుణం కలవారు కల్లకపటము లెఱుగనివారు అగు శ్రీరాం కోటయ్యగారిని వరించినది. ఈకాలంలో వరాన్వేషణం స్వయంగా కన్యకలు చూచుకొంటేనే మంచిది. అది అనుకూలదాంపత్య మవుతుంది లేకపోతేడబ్బుకాసపడి గుణములేనివరుని తెస్తే యిబ్బందులు చాలావుంటాయి. మాకృతికన్య కృతిపతికి సర్వవిధముల శుభములనే కూర్చుచుండును. మఱిన్ని నాకు కవిత్వము ప్రసాదించిన అపరదేవత నన్ను సర్వవిధాలకాపాడుచున్న ఆ తల్లి ఆదిశక్తిౘమె యుండియు నామీాద దయచేతకాబోలు నేను చెప్పినట్లువిను ఆశ్రీచక్రసంచారిణి ఆరాజరాజేశ్వరి కృతిపతిని దత్కుటుంబమును సర్వదారక్షించుగాక !

అన్నిటికంటె గొప్పభాగ్యం.

దుగ్గిరాల హైస్కూలులో ఆంధ్రోపాధ్యాయులును అనేక గ్రంథకర్తలునుఅగు బ్రహ్మశ్రీ కవిశేఖర, పండిత వడ్డెపాటి నిరంజన శాస్త్రిగారు నామీాదయభిమానముచేత నాటకమునకు పీఠికవ్రాయుట నాకు గొప్పభాగ్యము నేను వారికి సర్వదా కృతజ్ఞుడను.

తెనాలి } ఇట్లు,
18—10—26 } గ్రంథకర్త దో॥ సీతారామారావు.

శ్రీమత్పరదేవతాయైనమః

# కృతి ప్రశంస.

శ్లో॥ దేవప్పాయాదమృత కిరణప్రసావి చూడావిభూషః
లోకత్రయ్యాదమృత కణికాదాయి ధమ్మిల్ల పాశః
నాట్యారంభ ప్రసృతడమరుధ్వాన సృష్టాక్షరాళిః
శ్రీ శ్రీరామాన్వయ జలనిధిశ్చంద్రి కోటీశ్వరాఖ్యమ్.

శా॥ శ్రీమత్సర్వ చరాచరప్రకృతిఁ గు ♦. క్షిందాల్చి రక్షించి, స
ర్వామర్త్యుల్ పినుతింపఁ బ్రత్యణుగతుం ♦ డైయొప్పు సర్వేశ్వరుం
డోముంగాత సమస్తవైభవ మహా ♦ యుర్భాగ్యముల్ గూర్చి సు
శ్రీమాన్యున్ వర విశ్వకర్మకులజున్ ♦ శ్రీరామ కోటీశ్వరున్.

క॥ కాపురమై కలుములకును
గోపురమై పురములకును ♦ గురుజనములకుఁ
దాపురమై కొల్లూరను
శ్రీపురరాజంబు చెలఁగు ♦ క్షితితలమందున్.

తే॥ గీ॥ అప్పురమున శ్రీరామ వం ♦ శాబ్ధిచంద్రుఁ
డైన వెంకట కృష్ణాహ్వ ♦ యమున నొప్పు
నమలగుణునకు శ్రీ వేంక ♦ మాంబయందు
సుతులు జనియించి నారేవు. ♦ రతులగుణులు.

ఉ॥ అందఱు సద్గుణాకరులె ♦ యందఱు సీశ్వర పాదభక్తులే
యందఱు ధర్మచింతనులె ♦ యందఱు ధీజన సద్విధేయులే
యందఱు బండితాదరణ ♦ మందతిమోదము గల్గువారలం
చందఱు వేయినోళ్ళఁగొని ♦ యాడఁగ భాసిలిరంను నల్వురున్.

శ్రీ గంగయ్య, కోటయ్య, కైలాసము, రాజశేఖరము, నను నా
నల్వురు సోదరులయందును,

మ॥ దివిజేంద్రార్చిత విశ్వకర్మ పదభ ♦ క్తి ప్రౌఢికిందావు, ధ
ర్మవిచారంబునకుఁ నివాసము, మహా ♦ మర్యాదకుఁ బేటి, స
త్యవచోదీక్షకుఁ బట్టుకొమ్మనుగుణో ♦ ద్దామా మరోర్వీజ మం
చు విశేషంబుగ సన్నుతింతురు ♦ జనస్తోమంబు కోటీశ్వరుఁ.

మ॥ సిరికిఁ వాసము తద్గృహంబు, మఱి త ♦ చ్చిత్తంబు కాత్యాయనీ
శ్వర పాదాంబుజ సేవఁ గోరును; బ్రశ ♦ స్తంబైన హస్తంబులా
నిరతంబుఁ ఘనదాన ధర్మనియతిఁ ♦ వెల్గొందగాఁ గోరు న
ద్దిర కోటీశ్వరు మెచ్చుకొందురుసదా ♦ ధీరోత్త మాగ్రేసరుల్.

శా॥ సొమ్ముల్ వాహనముల్ గృహంబులును సం ♦ శోభిల్లఁగాఁ జేయలే
వెమ్మాడ్కిఁ మదిఁ జూచినఁ సతికిఁ బ్రా ♦ ణేశాంఘ్రి సత్సేవయే
సొమ్మై పుణ్యముకూర్పఁగాఁ గలదటం ♦ చుఁ గోటయాభిఖ్య నా
యమ్మా యమ్మనరించె భర్తగ మహా ♦ హ్లాదంబు సంధిల్లగన్.

మ॥ పతిభక్తిఁ సుజనానురక్తి హితవా ♦ క్యాంశిత్య శక్తిఁ రమా
సతికిఁ దోడనఁజాలి, సాధుసుమన ♦ స్సంస్తూయ మానంబనా
రత సత్కీర్తి నిధానదానమహిమఁ ♦ రంజిల్లి యబ్బాలికిఁ
జతగావర్ధిలె నాసతీతిలకమె ♦ న్నఁ శక్యమే యేరికిఁ.

సీ॥ సర్వలోకానంద ♦ సంపాదకక్రియ
దావితోఁ గుసుమంబు ♦ తనరినట్లు
నరనాథచంద్ర స ♦ న్మాన్యమై శోభయు
మానికంబును నేక ♦ మైనకరణి
శృతికనుకూలప ♦ ద్ధతిగల్గి వాగర్థ
ములు పరస్పరమును ♦ గలియురీతి
జగదవనోత్సాహ ♦ సన్నద్ధసంపద
శ్రీసతియుఁ బతియుఁ ♦ జెలగువరుస

తే॥ బహుళ సజ్జన సంస్తుత ♦ భవ్యభోగ
భాగ్య సంతానకీర్తి ప్ర ♦ పత్తి తోడఁ
జెలఁగుచుండిన యీ దంప ♦ తుల సుగుణము
కవివరుల శేఖినులను దాం ♦ డవమునాడు.

సద్గుణ గరిష్ఠుఁడును, నిరంతర విద్వద్గోష్ఠీతత్పరుఁడును, మిత్రహిత కార్యధురంధరుండును, నగు నా శ్రీరామ వంశక్షీరజలధి సంపూర్ణ తుషారకరుండగు, కోటయాభిధానుఁడు కార్యాంతరవర్తియై కొల్లూరునుండి తెనాలి కరుదెంచి, నేను శ్రీపోతులూరు వీరబ్రహ్మేంద్ర స్వామి చరితము నాటకరూపమున వ్రాయుచుండుట విని, మదీయ ప్రాణమిత్రులును, నాయుర్వేద విద్యావిశారదులును, నాంధ్రగీర్వాణ భాషాకవులును నగు శ్రీ దంతనాల నాగేశ్వర శాస్త్రిగారిచేఁ బ్రేరేపింపఁబడి మదీయ సదనమునకరుదెంచి,

మ॥ నను శ్రీ ద్రోణమరాజ వంశజమణీ ♦ శ్రీలామహామంత్ర చిం
తన సంపాదిత చిత్రచారుకవితా ♦ ధారాలసత్కీర్తిచం
దన సంలబ్ధ మహావధానధన సీ ♦ తారామ నామాంచితున్
ఘన విద్వన్మణిగాంచి యిట్లుబలికెన్ ♦ జాతుర్య వాగ్వైఖరిన్.

తే॥గీ॥ సప్త సంతానములయందుఁ ♦ జర్చసేయ
గృతికిఁ బతియౌట యే కడు ♦ గొప్పయందు
రందుచే నీవు రచియించు ♦ నట్టి వీర
యోగినామ నాటకమును నొప్పుమీఱఁ
గృతిని సంధింపుమీ మాకు ♦ నతులకరుణ.

అని వచియించి సువర్ణయుక్తమైన తాంబూల సత్కార మొనర్పగా, శాంతగుణప్రధానుఁడును, నిష్కల్మషచిత్తుఁడును, గర్వరహితుఁడును, నగుటంజేసి, మత్కావ్యకన్యక యీ సుగుణమణిని వరించుటకు సమ్మతింప, నేనును బ్రముదితచిత్తుండనై తగిన వరుఁడేయని తలంచి, యాతని. గృతిపతిగా నొనర్చితిని.

సీ॥ సకల భాషావిశే ♦ ష రహస్యనిక్షేప
కుక్షినై యలరెడు ♦ కోమలాంగి
వ్రేళ్ళఁజూపఁబడఁ గొ ♦ ప్పిన యరుంధతిరీతి
భాసిల్లుచుండిన ♦ పద్మగంధి
క్షితినాథచంద్రుల ♦ స్తుతిఁగాంచియశముతో
వర్ధిల్లుచుండిన ♦ వారిజాక్షి
గర్వమింతయులేక ♦ కవులకెల్లను విధే
యతఁజూపి చరియించు ♦ నమలగాత్రి

అట్టి మామక కావ్య క ♦ న్యాలలామ
ఘనశుభంబులు నీకిచ్చి ♦ మనుచుఁగాత
ధరణియందున నాచంద్ర ♦ తారకముగ
నమల గుణగేయ; శ్రీకోట ♦ యాభిధేయ.



# వీరబ్రహ్మయోగి.



—♦ నాంది ♦—

చ॥ సిరిమగఁడుం బితామహుఁడు ♦ జేరిభజింపఁగ వెండికొండపై
సరసన వేందుకాంతమణి ♦ సౌధముసందుఁ బసిండిగద్దెపై
గిరిసుత గూడి వేడుకల ♦ గేరెడుబాల శశాంకమౌళి, కి
న్నరగణ రాజమిత్రుఁడు ఘ ♦ నంబుగసభ్యులనేలుగావుతన్.

శా॥ ఏజాతిన్ జనియించినన్ మఱియుదా ♦ మెచ్చోటవర్తించినన్
సౌజన్యాకలితాంతరంగులగుచున్ ♦ సద్భక్తితోనుండి, తన్
బూజల్ చేసెడుమానవాళికిశుభం ♦ బుల్ సౌఖ్యముల్ గూర్చు, నా
"జేజేనాయన" వీరసద్గురుఁడు, రక్షించున్ సభాస్తారులన్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు:— (తనలో) నేఁడీసభ్యుల యాజ్ఞనిర్వహించి మెప్పు బొందుటయెట్లోకదా! పారిపార్శ్వకుఁడీవిషయమునదగిన యాలోచనముజెప్పకయుండునా! బుద్ధిబలమున నాతఁడు నాకంటెఁ బెద్దగదా! (ఎదుటజూచి) తలంచినయంతనే యాతఁడేవచ్చుచున్నాఁడు. ఇదియొక శుభసూచకము.

పారిపార్శ్వకుఁడు:—(ప్రవేశించి సూత్రధారునిజూచి) బావగారీరోజున వీరబ్రహ్మగురునామస్మరణ జేయుచున్నారేమి! శరీరములో నస్వస్థతలేదుకదా! అయినను మీకిప్పుడు భయములేదులెండి. మాయక్కగారి మంగళసూత్రము కడుఁగట్టిది.

సూత్ర:— నీపరిహాస వాక్యములకేమిగాని, యిపుడొక చక్కని విషయముమాత్రము జ్ఞప్తికిఁదెచ్చి మహోపకార మొనర్చినావు.

పారి:— ఏదది!

సూత్ర:-వీరగురునామస్మరణమంటివే! అదియే! ఏలయనిన, నటుజూడుము.

తే. గీ॥ రాజు వీక్షింపవేచు చ ♦ క్రములరీతి
మన్ప్రదర్శనమీక్షింప ♦ మహితసభ్యు
లరుగొ వేచియుండిరికాంత ♦ ననుఁగుమఱఁది
వీరిరంజింపఁజేయుట ♦ వేడ్కకాదె.

పారి— నాటకములనిన జనులపాలిటికి నాటకములుగా భావింపఁ
బడుచున్న యీదినములలో దత్ప్రదర్శనమునకు మిమ్ము బ్రేరేఁ
పవచ్చిన యీసభ్యులనెంతయుఁ గొనియాడవలయును. (ఆలో
చించి ఓహో! మఱచితిని. నేడుశివరాత్రికదా! నీవిధముగ
నైననీరాత్రి జాగరణంబొనరింప దలఁచిరికాబోలు!

సూత్రి:— వీరందఱును బరమభక్తులు. అందుచేతనే నన్నుబిలిచి;

సీ॥ ఎవ్వానికథలుక♦ర్ణేంద్రియంబులుసోకనఖిలకల్యాణంబు♦లలరుచుండు
ఎవ్వానిపదసేవ ♦ లేవొద్దుగావింపఁ బాపజాలంబులు♦భస్మమగును
ఎవ్వానిచర్యల♦నెవ్వియైనను విన్న సంతాపములువోయి♦శాంతిగలుగు
ఎవ్వానియాలయం ♦ బీక్షింపగల్గిననమితతత్వజ్ఞాన ♦ మందనగును.

తే గీ॥ నెవఁడు రజతాద్రివాసుఁడే ♦ యిల్లపుట్టె
ననుచుఁదలఁచి కొలిచి నిఖి ♦ లార్థసమితి
నందగల్గిరి జనులెల్ల ♦ నట్టిబ్రహ్మ
చరితమును నాడుమనిరి యీ♦సభ్యులెల్ల.

దానినిప్పుడుమనము ప్రదర్శింపవలయును.

పారి:— కందిమల్లయపురమున జీవసమాధి గ్రహించిన వీరబ్రహ్మము
గారికథయన్నమాట. ఇదియు వింతగనేయున్నది. చింతా
మణి మొదలగు శృంగారప్రదర్శనముల కుబ్బి తబ్బిబ్బుపడు
చుండు వీరు భక్తిరసప్రధాన నాటకమును గోరిరిగా! శుభము
శుభము- కాని, యట్టినాటకముచే వీరిని రంజింపఁజేయుట
మిగులకష్టము. ఏమాత్రము కొంతకల్గినను రసగ్రహణ
పారీణులగు వారు శాంతభావముతో నెమ్మదిగా మంచిచెడ్డలఁ
దెలుపుదురు. పనిపాటులులేక, దేనికిని సామర్థ్యములేక,
విద్యయున్నను దానినుపయోగించు తెరువుగానక, యుండు
మహనీయులు మాత్రము:— నాటకరచన శ్లాఘ్యముగనుండ
లేదు. ప్రదర్శనము బాగులేదు,- అని మెడకు "డప్పు" కట్టు
కొని రహస్యముగాఁ జాటుచుందురు. అయినను, నిట్టిదం
తయుఁ జూచుచున్నచో గ్రంథకర్తనాటకమును వ్రాయలేదు.

నటకులు ప్రదర్శింపలేరు. కావున నట్లుచేయు మహాత్ములను స్మరింపకుండిన మనముగాని, గ్రంథకర్తగాని విజయలక్ష్మిం బొందుటకు సందియములేదు. (ఇంచుక యూరకుండి) ఇంతకును నాచరిత్రమును నాటకముగా రచించిన దెవ్వరు?

సూత్రి:— గ్రంథకర్త మనకుఁ జిరపరిచితుఁడే. అంకినీడు భూపాల కృతసన్మానవిలసితుఁడు; వెంకటకృష్ణరాడ్విభుదత్త హేమపతక విరాజితుఁడు; వెంకటాద్య్రప్పరాయ క్షితిపాల సమాదరణపాత్రుఁడు; పీఠికాపుర సంస్థానాధీశ్వర శ్రీ మహా రాజ రావు కుమార మహీపతి వెంకట సూర్యరాయ ప్రభువరానుగ్రహపాత్రుఁడు;– రాణీరావు రామయాంబా కృపావిశేష సంలబ్ధ గౌరవ శ్రీయుతుఁడు; చెలికాని వెంకట ధర్మరాయ సూర్యరాయ సోదర సమర్పితానేక సత్కార విభ్రాజితుఁడు:—

పారి:— సీతారామ కవినిగూర్చియేకద నీవు చెప్పుచుంటివి. అది నేనుగ్రహించితిని.

చ॥ తిరుపతి వెంకటేశ్వర సు • ధీశులఁగొల్చి నిరర్గళాద్భుతా
కర రసపుంజమంజుల వి • కస్వర చారుకథాసుధా దురం
ధర బహుళప్రబంధ కవి • తా వనితా మహితోక్తిసంపదన్
ధరణిని ఖ్యాతిఁజెందు కవి • తల్లజు నాతని నే నెఱుంగనే.

ఈతఁ డానాటకము నేల వ్రాయవలసివచ్చెనో. అతఁడు మధ్వకులస్థుఁడు. ఇది శైవసంబంధమైన కథ కదా!

సూత్ర:— అదియా నీకుగలిగిన సంశయము. అతఁడు హరిహర భేదములేనివాడే. అదియుంగాక వీరబ్రహ్మగురుఁడు వీరనారాయణ పరబ్రహ్మయని పేర్కొనఁబడినాడు. అమ్మహాత్ముఁడు హరిహరాంశములఁబూని ఖ్యాతి నదయించినవాఁడని యెఱుంగుము. మతభేదములేక యా యోగివర్యునిగొలిచి యందఱును కృతార్థులగుచున్నారు. మఱియొక విశేషమున్నది.

మ॥ తనకున్ మిత్రుఁడు దంతనాలకుల స • ద్వాదోధచంద్రుఁడు; ధీ
జనసంస్తుత్య భిషగ్వరుండు భయభా • షాసేవకుండైన యా

ఘన నాగేశ్వరశాస్త్రి యిక్కథ నొకిక గావింపుమా నాటకం
బని, ప్రేరేపఁగఁ వ్రాసె మోదమున నీ తారామనాముంశీలక్.

ఈతఁడీగ్రంథమును రచించి కొల్లూరుపురనివాసియు, విశ్వబ్రహ్మణకులసంభూతుఁడును, సచ్చరిత్రుండును. నిరంతర విద్వద్గోష్ఠీగతత్పరుఁడును, శ్రీరామ వంశజలధి చంద్రుఁడును, నగు కోటయాభిధానునకు కృతినిచ్చెను.

పారి:— అట్లయిన నిక జాగేల! ప్రదర్శనోద్యోగమున వర్తింతము.

—* లయగ్రాహి *—

కాంతులు నిరంతరము - కాంతలనుగూడి ముద
మెంతయు గ్రగ్గగల - తాంతివన కేళీ
స్వాంతులయి యోకిడు - సంతసముమీఱఁ దరు
సంతతుల నీడలను - శాంతిగొనుచుఁ భూ
జంతులను జూనుచును - పంతమున నాటలను
నెంతయును నాడుచును - ప్రాంతములలో శ్రీ
కాంతసుతు క్రీడలన - నంతముగ దేలగను
వింతయగు కాలము వ - సంతమొతెలుఁపఁక్.

అట్టి వసంతకాలముఁగూడ నాటకప్రదర్శనమునకు నెంతయు బాగుండును.

(తెరలో) ఛీ! ఎవఁడవురా నీవు! భక్తిలో శృంగారమును గలుపుచుంటివి. వీరబ్రహ్మగురుని సేవింపఁబోవు నా శ్రవణముల నిట్టివాక్యములు వేసిన నీనాలుక వేయిచీలికలు చేసెదగాక!

పారి:— (భయమునభినయించి) ఇదియేమి!

సూత్ర:— మన మీ ప్రదర్శనమునుగూర్చి ప్రశంసించుచుండఁగా, మీయక్క తెలివిగలిగినదగుటచే ప్రదర్శనములకుఁ బాత్రములను వెంటనే సిద్ధముజేసినది. ఇప్పుడు మనము విన్న పలుకులు సిద్ధునిపాత్ర ధరించినవాని నోటినుండి వెలువడినవి. రమ్ము మనమును పోవుదము. (నిష్క్రమింతురు.)

—: ఇది ప్రస్తావన. :—

# వీరబ్రహ్మయోగి.



## ప్రథమాంకము

ప్రవేశము:—సిద్ధుఁడు.

సిద్ధుఁడు:—ఛీ! ఎవడవురానీవు! భక్తిలో శృంగారమును గలుపుచుంటివి. వీరబ్రహ్మగురుని సేవింపఁబోవు నా శ్రవణముల నిట్టివాక్యముల వేసిన నీనాలుక వేయిచీలికలుచేసెదఁగాక! (అటునిటు చూచి) ఏరీ! ఎవ్వరును లేరు. (ఇంచుకయూరకుండి) ఈప్రపంచమంతయు మాయ. ప్రజాసమూహమంతయు మాయ. తల్లిదండ్రులు, ఆలుబిడ్డలు, అన్నదమ్ములు వీరందఱును నెక్కడనుండివచ్చిరి? నేనెవ్వఁడను! ఎట్లుపుట్టితిని! ఎక్కడికిబోవుదును! ఈ యస్థిరములగు సంపదలేమి! ఈసౌఖ్యములేమి! ఈభోగములేమి! భార్యాభర్తలకు మోహసంబంధమైన యనురాగమట! పుత్రవాత్సల్యమట! అన్నదమ్ముల ప్రేమయట! ఇవియన్నియు స్థిరముగా నిలిచియుండుననియే కాబోలు, నజ్ఞానులయభిప్రాయము! లోకమున్నంతవఱకు జీవించియుండవలయునని ప్రతిమనుజుఁడును గోరుచుండును. ఇది నాగృహము! ఇది నాధనము! అని పలుకుచుండును. వచ్చునప్పుడు తాము గొనిరాలేదు. పోవునప్పుడు గొనిపోరు. అప్పుడు తమదేమగునో!

మ॥ తనువుంబోయినమీఁదటన్ బహుళశ్రీ ♦ దంబందుచున్ గాటిదా
కనె నేతెంతురుగాని చుట్టములు బ ♦ క్కాలెవ్వరున్ జీవితోఁ
దనవెంటం జనుదేరరంచనెడిస ♦ త్యంబున్ విచారించి, యీ
జనముల్ బాయరదేల ఘోరమగు నా ♦ సంసార విభ్రాంతులన్.

ఈసంసార కూపమునఁబడి నానా కష్టములఁబొందు వారికి మోక్షమెట్లులభించును! పరమేశ్వరుఁడు వారి ననుగ్రహించునా!

మ॥ తనువుల్ సంపదలున్ సుఖంబులును ని♦త్యంబంచు నూహించి,యీ
జను లేవేళ సుమేశునింగనక సం♦సారాంధ కూపంబులో
మునుఁగన్ జూచుచునుందు రెవ్వఁడు నదే♦మోకాని,యీమాయనా
యనఘుండే యొనరించుచుండు ననినే♦నాత్మన్ విచారించెదన్.

ఇదియంతయు నిశ్చయముఁగా భగవంతునిమాయయే. సంసారమొక మాయానాటకము. ఈజీవులు పాత్రలు. భగవంతుఁడు సూత్రధారియై వీరినాడించు చుండును. (ఇంచుకయూరకుండి) అబ్బబ్బా! ఈమాయా సంసారకూపమున నేను బడఁజాలను. ఈసౌఖ్యములుగాని భోగములుగాని నాకువలదు. తల్లిదండ్రులతోఁగాని, హితులతోఁగాని, బంధువులతోఁగాని నాకుఁబని లేదు. జన్మ జరామరణంబులును, సుఖదుఃఖంబులును, లేక నెలుఁగు మహాత్ముని, సత్యమై నిరాకరమై, శాంతమై,బుద్ధమై, సిద్ధమై, పరిపూర్ణమైయొప్పుమూర్తి వానిని, ఆపరబ్రహ్మను, సృష్టిస్థితిలయకారణుని. ననంతుని సేవించి మోక్షసామ్రాజ్యంబునందెదనుగాక. (ఇంచుకయూరకుండి) ఇఁక నేనింటికిబోవను. వీరబ్రహ్మేంద్రస్వామిని జేరికృతార్థుండనయ్యెదఁగాక! నాకిదియే త్రోవ. అమ్మహనీయుఁడు హరిహర రూపంబునఁ గలికాల మూఢజనుల యజ్ఞానంబు వాప నుదయించి మహామహిమాస్పదుఁడై విలసిల్లుచున్నాఁడు. అమ్మహానుభావుఁడు నన్ను రక్షింపకయుండునా!

మ॥ ఇతఁడా చూడఁగఁ జిన్నవాఁడు; భళిరా♦యీరీతి సంసార దు
ర్గతినిం జెందగ నిచ్చలేక ముదమా♦రన్ వచ్చె నిచ్చోటికే
గతిఁ జేపట్టుదునంచు లోఁదలఁచునో♦కారుణ్యమున్ బూని స
న్నతి రక్షింపఁగఁజూచునో యికపయిన్♦నా భాగ్య మెట్లున్నదో.

ఆ యవతారపురుషుఁడు ఆశ్రితత్రాణ పరాయణుండనియు, సత్కృపాకరుండనియు వినియుంటిని. అట్టియెడల నన్నాతఁడేల యనుగ్రహింపకయుండును! (ఇంచుకయూరకుండి తనచిత్తము నుద్దేశించి) ఓచిత్తమా! నీవిఁక నన్యచింతలను బ్రవేశపెట్టుకొని గృహాభిముఖవుగావలదు. జననీజనకుల క్షేమను విడిచిపెట్టుము. బుధుజనానురాగమునుమఱచిపొమ్ము.మిత్రవాత్సల్యమునుబరిత్యజింపుము. సంసారబంధమును గోసివేయుము. వీరబ్రంహ్మేంద్ర స్వామిని నాశ్రయింపుము. అతఁడేనీకు దైవము. అతని దయచే నీవు కడతేరఁగలవు

మ॥ తనువుల్ శాశ్వతమాయశోవిదిత మాం♦ధాతాదిభూమీశ్వరుల్
చనరే, వైహిక సౌఖ్యముల్ సతము లా♦జాయాత్మజుల్ నిత్యులా
ఘనసామ్రాజ్య రమావిలాసములు వీ♦ కెవ్వెంట నేతెంచునా
మనమా! నీవిఁక వీరసద్గురుని సం♦ భావించి పూజింపుమా.

మ॥ జననీ మూత్రపురీషసంతుల రస♦ స్సంభూతమై యీగతిన్
దనువుందాల్చిన నీచమర్త్యుఁడనుచున్ ♦ భావించి సంసార వా
ర్ధిని నన్నున్ బడవేయకుండ ఘన సం♦దేహంబులన్ బాసి, నీమా
మనమా! నీవిఁక వీరసద్గురుని సం ♦ భావించి పూజింపుమా.

ఇంక సందేహింపనేల! (ఆకసమువంక జూచి)

సీ॥ పచ్చికబయళుల ♦ విచ్చలవిడి మేసి
యాలమందలు నిండ్ల ♦ జాలువట్టె
తీయతేనియఁ ద్రావి ♦ దేహంబులెఱుఁగక
తేటగములు పద్మ ♦ వాటిఁజేరె
జక్కవకవలకు ♦ సంపుల్లకుముద లో,
కములకుమతుల ము ♦ దములెసంగె
తప్పునేమోయని ♦ దారికేదారముల్
వృద్ధులెల్లరు వేగ ♦ విడచుచుండ్రి

తే॥ గీ॥ పొక్కిళుల నెరనిరికించి ♦ పులుగుగములు
కలకలారావముల గూళ్ళ ♦ కెలనఁ బర్వ
సంజకెంజాయ మెలమెల్ల ♦ జారదొడఁగె
పద్మినీకాముకుఁడు గ్రుంకెఁ ♦ బడమటిదెస.

నేను సత్వరముగ నడచి నేటిరాత్రికా కనఁబడు పల్లెయందు నిద్రించెదగాక. (నిష్క్రమించును.)

రంగము:— [బనగానపల్లెయందు వీరబ్రహ్మాశ్రమమున నొంటిగా ఈశ్వరి ప్రవేశించును.]

ఈశ్వరి:— (తనలో) ఈలోకమంతయు నాకదియొక విధముగఁ గన్పట్టుచున్నది. పుణ్యభూమియగు నీయార్యావర్త ప్రజలందఱును నజ్ఞానాంధకార మగ్నులై యుండిరి. దీనికిఁదోడు పరిపాలనమా తురుష్కులదై యున్నది. భారతీయులనే తెఱంగునఁ జూడవలయునో వారొక్కింతయు గ్రహింపకయున్నారు. (దేశమునుద్దేశించి)

సీ॥ ధర్మవ్రతాచార ♦ ధౌరేయుఁడైన దు
ష్యంతుఁడేలెను నిన్ను ♦ సత్యవిధిని
బహుయాగములు జేసి ♦ ప్రజలను రక్షింపుచు
భరతుఁడు మేటియై ♦ పంథవిల్లె
పగర నెల్లరఁగూల్చి ♦ పాండవాగ్రజుఁడు నిన్
బాలించెఁ దానతి ♦ ప్రతిభతోడ
తాత యశంబు వి ♦ ఖ్యాతి నందించుచు
నా పరీక్షితుఁడేలె ♦ నవనితలము

తే॥ గీ॥ అట్టిమహనీయులందఱు ♦ నరిగినారు
పాపమే యెక్కుడగుచును ♦ బ్రబలుచుండె
కఱకు తుఱకల పాల్బడి ♦ క్రాలుకతన
భరతవర్షమ! యేమని ♦ వగచుదాన.

(తెరలో)

తల్లీ! ఈశ్వరీ!

:— (పక్కకుఁ దిరిగిచూచి) తాతగారుకాబోలు పిలచుచున్నారు! (ప్రకాశముగా) తాతగారూ! నేనిచ్చటనే యుంటిని.

వీరబ్రహ్మగురుఁడు:— (ప్రవేశించి యీశ్వరిం గాంచి) అమ్మా! నీవిచ్చట నొంటిగ నేమిచేయుచున్నావు? నీతండ్రి గోవిందుఁ డెచ్చటికరిగెను. పోతులూరయ్య యాశ్రమంబున లేడేమి! (పరికించి) ఇదియేమి!

తే॥ గీ॥ చారుశారదపూర్ణిమా ♦ చంద్రుపోలె
వెలుగుచుండెడి నీముఖ ♦ బింబమిట్లు
వాడ నేటికి నిశియుంపఁ ♦ బద్మమట్లు
చెప్పుమాతల్లి నీకున్న ♦ చింతఁదీర్తు.

ఈశ్వ:— తాతగారూ! హరిహరస్వరూపులగు మీకడనుండగా నాకితర చింతలేమి యుండును. లోకవిషయమైన చింత యొక్కటియే నామనంబునఁ బాదుకొనియున్నది.

వీర:— అదియెట్టిది?

సీ॥ ఆచారమంతయు ననని పా ♦ ల్గావించి
భూసురగ్రామణుల్ ♦ బొలుతురనియొ
మత విచక్షణలేక ♦ మతములెల్లను నేక
మగుచు ధరాస్థలి ♦ నలరు ననియొ
రత్నగర్భయగుచు ♦ రాజిల్లుదేశంబు
పాడి పంటలతోడఁ ♦ బ్రబలదనియొ
జారచోరులు హెచ్చ ♦ సర్వేశుపూజలు
సమధికప్రీతిని ♦ సాగవనియొ
తే॥ గీ॥ పృథ్వీపతులు విప్రులను సే ♦ వింప రనియొ
రాజభక్తిని ద్యజియించి ♦ ప్రజలు ధరను

విమల దేశాభిమానంబు ♦ విడుతురనియొ
చింత నొందుచునుంటివి ♦ చెప్పుమమ్మ.

ఈశ్వ:— మహానుభావా! నీకుఁ దెలియని దేమున్నది!

సీ॥ ఏయభీష్టము గోర ♦ నాయభీష్టముదీర్పఁ
దృటిలోన యత్నింతు ♦ ధీరచరిత
సకల దిగ్దేశ రా ♦ జన్యులు భక్తిమై
సేవింప నలరారు ♦ చిగురుబోఁడి
అఖిల సంపదలకు ♦ నాకరంబైనట్టి
పాడి పంటలకెల్లఁ ♦ బాలవెల్లి
సకలభాషా విశే ♦ ష రహస్య నిక్షేప
కుక్షినై యలరెదు ♦ కోమలాంగి

తే॥ గీ॥ భవ్యగుణగణోపేత యీ ♦ భరతమాత
వివిధ బాధలఁ బొందెడు ♦ విధముఁ దోచె
నామె కెట్టులైన మోదంబు ♦ నిచ్చు తెరువు
లేక యున్నదే జగమునఁ ♦ బ్రాకటముగ.

దేశస్థితిఁ జూడ నాకు మిగుల విచారముగు చున్నది.

సీ॥ కూటసాక్ష్యములిచ్చి ♦ కొంపలఁ బడద్రోయు
విమలాత్ము లెందఱో ♦ వెలసినారు
కల్లవాక్యములాడి ♦ కాంతుల వలలోన
బడవైచు కాంతలు ♦ ప్రబలినారు
మంత్రులై యుండియు ♦ మహిపాలు వంచింప
దలఁచెడివారలు ♦ చెలఁగినారు
మనవారటంచును ♦ మదినెంచకయ మోస
మును సేయు వారలు ♦ దనరినారు

తే॥ గీ॥ చిత్రచిత్ర గతులతోడఁ ♦ జెలఁగుచుండె
నేమిచెప్పుదు మఱియింక ♦ నెన్నికలవొ

మెచటఁజూచిన నీట్టిదే ♦ మెంచిచూడ
కట్టి యిట్లుండె నీకళి ♦ కాలచర్య.

ఇంతకును దేశాధికారులై యున్న తురుష్కుల దుష్కృత్యములు
ప్రబలుచున్నవని నాతలంపు.

సీ॥ సకలభాషా విశే ♦ ష రహస్యములఁ దెల్పు
సద్గ్రంథ రాజముల్ ♦ సమసిపోయె
బ్రాహ్మణోత్తములెల్లఁ ♦ బఱియించుచుండెడి
వేదాది విద్యలు ♦ పృథ్విఁగలసె
దివ్య రత్నప్రభా ♦ దేదీప్య మానమౌ
మాధవాలయములు ♦ మంటఁగలసె
విశ్వేశు గుడిలోన ♦ విగ్రహాళి మసీదు
ముందట సోపాన ♦ ములుగ మారె

తే॥ గీ॥ ధర్మమనుమాట యెక్కడో ♦ దాగియుండె
బాపమే యున్నిమూలలఁ ♦ బ్రబలుచుండె
మ్లేచ్ఛ కులజులపాలన ♦ హెచ్చిపోయె
నేమి చెప్పుదు నింకిట్టి ♦ వెన్నికలవొ.

సీ॥ విగ్రహారాధన ♦ నిగ్రహింపుఁడటంచు
విగ్రహాల్ నీటిలో ♦ విడిచినారు
సంధ్యా ద్యనుష్ఠాన ♦ సత్కర్మ నిరతులౌ
భూమీసురులఁ జావ ♦ మోదినారు
వీణెఁ జేతనుబూని ♦ విశ్వేశు గీర్తించు
భక్త సంతతినెల్ల ♦ బట్టినారు
హిందూమత గురుల ♦ నిస్లాము బోధింపు
డంచు నెంతేని హిం ♦ సించినారు

తే॥ గీ॥ దేవతా ప్రాంగణంబులఁ ♦ దీసి యచట
వీరు బొమ్మల ముదమారఁ ♦ బెట్టినారు
చేయవలసిన పనులన్ని ♦ చేసినారు
తండ్రి! నీవింక దీనినిఁ ♦ దలఁపవలదె.

నీవు మహా యోగీశ్వరుఁడవు. లోకంబున మూఢుల యజ్ఞానాంధకారముఁ బాప జనించిన భగవంతుఁడవని జనంబులెల్లరు నిన్ను సేవించి కృతార్థులగుచున్నారు. నీదివ్యమహిమలు మహాద్భుతము గొలుపుచు నెందును నెదురులేనివై యున్నవి.

శా॥ వేదంబుల్ నశియించె, మ్లేచ్ఛమత ము♦ర్వీవ్యాప్తమయ్యెన్ వృథా
వాదమ్ముల్ బలిసెన్ జనాళికిని దే ♦ వధ్యానముల్ చూడఁగాఁ
జేదయ్యెన్ గులగోత్ర భేదములచే ♦ క్షేమంబు లేదండురో
వేదాంత ప్రతిపాద్యరూప! యిక లే ♦ వే! బ్రోవవే లోకమున్.

తే॥ గీ॥ భరతమాతకు నెన్నెన్నొ ♦ పాట్లుదెచ్చి
కంట నీరంబు బెట్టింప ♦ కలుషమతుల
జ్ఞానహీనతఁ బాపంగ ♦ స్వాంతమందు
దలపుఁ బూనవదేమి! యో ♦ లలితచరిత.

వీర:—— ఈ విషయమునుగూర్చియా నీకుఁ గలిగినచింత. ఇట్టి పని యంతయు భయంబున జరుగవలసినది కాదు. తురుష్కులట్టి క్రూరకార్యముల సేయుచుండుట యజ్ఞానముచేతఁగాని మఱియొండు కాదు. ప్రజల మూఢత్వమును, నీవు చెప్పినతురుష్కుల యధికారమును నేను పరిశీలించుచునే యున్నాను. నిర్మల బోధచే విజ్ఞానంబొసంగి వారిని బవిత్రాంతఃకరణులుగాఁ జేయ వలయునుగాని మఱియొక మార్గము లేదు. నేనును సమయము కొఱకే నిరీక్షించుచున్నాను. అట్టి సమయముగూడ త్వరలోనే

వచ్చును. వచ్చిన వెంటనే యెట్టికార్యమునకైననుగడంగఁదగును (ఎదుటఁ జూచి) అరుగో గోవిందుఁడును పోతులూరాచార్యులునువచ్చుచున్నారు.

(గోవిందయ్యయు పోతులూరయ్యయుఁ బ్రవేశించుచున్నారు.)

గోవిం }
పోతు } (వీరగురునిఁజూచి) తండ్రీ! నమస్కారములు (పాదములకునమస్కరింతురు)

వీర:—చిరాయుష్మాన్భవ! ఇటఁగూర్చుండుఁడు

(ఇరువురును నాసీనులగుదురు)

గోవిం:—తండ్రీ! జీవస్వరూపనిరూపణంబును గూర్చి చెప్పెదమని సెలవిచ్చితిరి. దేహంబున జీవుఁడెక్కడనుండును? జీవునిస్వరూపమెట్టిది? దేహము నశించినపిమ్మట నెచటికిఁబోవును! దయఁబూని చెప్పఁగోరెదము.

వీర:—పుత్రులారా! మీరతిరహస్యంబైనదాని నెఱిఁగింపుడనికోరుచుంటిరి. సత్యజ్ఞానాత్మకుండును, సచ్చిదానందరూపుండును, సవ్యక్తకారణుండును, నిత్యుండును, నిర్లేపుండును, నిరంజనుండును నై యుండి, సర్వలోకములకగమ్యుఁడై, సర్వంబెఱింగినవాఁడై, సర్వవికారంబులకుఁ బరిణామంబు లేక, వాక్కులవచింపనలవిగాకమనంబునకగోచరుండై, యానందమయుడై యున్న పరమాత్మఁగనుంగొనిన వానికి జుగుప్స లేదు. మోహశోకములు లేవు. (ఇంచుకయూరకుండి) మీసంప్రశ్నము మిగుల వర్ణనీయమైనది. అట్టిదానికి దగినసమయము జూచి చెప్పెదను.

ఈశ్వ:—తాతగారూ! ఎవ్వరోతమసన్నిధికిఁగాబోలు వచ్చుచున్నారు.

( సిద్ధుఁడు ప్రవేశించును. )

సిద్ధు:— (వీరబ్రహ్మగురునిఁజూచి తనలో) ఆహా!

మ॥ పరమోత్సాహ నిమగ్నమానసముతో ♦ భవ్యుల్ తనూజాగ్రణుల్
వర శైలాత్మజతుల్య యీశ్వరియు శం♦ భద్భక్తిరాజిల్లఁగాఁ
గర మొప్పన్ గొలువంగ నాసనమునన్ ♦ గంభీరరూపంబుతో
లలిఁజెన్నొందెడి బ్రహ్మముర్ గనఁగ నా ♦ హ్లాదంబు సంధిల్లెడిన్.

భళిరా! ఈయసదృశరూపము! ఇది సామాన్యమైనది కాదు.

సీ॥ పరమపావనియంచు ♦ వరకీర్తిఁగాంచిన
యమరవాహిని మస్త ♦ కమున నమర
నళికభాగమునందు ♦ నలఘు కుంకుమబొట్టు
కైవడి మూడవ ♦ కన్ను మెఱయ
వజ్రపంజరనిభ ♦ వక్షస్థలంబున
రమణీయసర్పహా ♦ రంబులలర
పగడంపుకాంతికి ♦ వంకఁబెట్టఁగఁజాలు
నరుణజటాసము ♦ త్కరముదనర
తే॥గీ॥ భూరి రజతాద్రినుండెడు ♦ పుణ్యమూర్తి
యైన శంభుఁడే యిట్టుల నవతరించె
నంచుఁ దలఁతుఁ గాకున్న నీ ♦ యనుపమాన
మహిమయుండునే వేఱొక ♦ మానవునకు॥

అమలభస్మోద్ధూళి కాంగకములు! రమణీయతర యోగివేత్రము, నిడుయోగపట్టము, నూతన పవిత్రకటిసూత్రము, అతి పృథు స్ఫటిక రుద్రాక్షమాలలు, పల్లవారుణ జటాపటలి, కాషాయ శాటిద్వయము. ఆహా! కన్నులపండువయగుచున్నది. ఈతఁడు హరిహరాకృతి ధరించి యిట్లు జన్మించిన మహనీయుఁడుగాని కేవలము నరుఁడా! (ఈశ్వరినుద్దేశించి) ఆహా! ఏమి! ఈమె దేహకాంతి విద్యుల్లత వలెఁబ్రకాశించుచున్నది. అపూర్వలావణ్యము మూర్తీభవించి చిత్రకారుల లేఖనికందనిదై యున్నది. కవులూహింపఁజాలని సౌందర్యవిశేషము. ఈసీమంతినీలోక

చూడామణి, ఈబాలయోగిని నిశ్చయముగామాతృదేవత, పరంజ్యోతి, ఆదిశక్తి. వీరిముఖావలోకనము, నావైరాగ్యమును స్థిరపఱచుచున్నది. ఇఁక నేనాలసింపనేల! ఈ వీరబ్రహ్మేంద్ర స్వామిని సమీపించి నమస్కరించి నావృత్తాంతంబెఱింగించి, యనుగ్రహామునకుఁబాత్రుఁడనయ్యెదనుగాక (వీరగురునిసమీపించి) స్వామీ! నమస్కారములు. (పాదములకునమస్కరించును)

వీర:— అభీష్టావాప్తిరస్తు, (ఇంచుకయూరకుండి) నాయనా! నీవెవ్వరవు?

సిద్ధు:—స్వామీ! కులము దాచుకొనినందువలనఁ బ్రయోజనమేమియున్నది? సత్యమునే వక్కాణింతును నాదిదూదేకులకులము.

గోవిం:—ఆ! నీవుతురుష్కుఁడవా!

పోతు:—ఛీ! తుఱకయా!

ఈశ్వ:-దగ్గరకురానీయకుఁడు (సిద్ధునిఁజూచి బ్రహ్మముగారినిజూపుచు)

తే॥ గీ॥ కలిజనాజ్ఞానమును బాప ♦ దలఁచి యిట్లు
ధాత్రిపైజనించిన యవ ♦ తారమూర్తి
యితఁడో; నీవాతురుష్కుఁడ ♦ వేఁవచ్చి
తిటకుతారతమ్యమింకింత ♦ యెంచవలదె.

తెలియక యరుదెంచితివికాబోలు. ఇఁకనైన నీవిచ్చటనుండి పొమ్ము. నీవు మమ్ము సమీపింపరాదు.

సిద్ధు:— తల్లీ! నీవట్లుసెలవిచ్చిన నేనేమనిచెప్పగలుగుదును. అరిషడ్వర్గలతికావితాన మీ బ్రహ్మేంద్రస్వామి సంకీర్తనోగ్రక్రకచమునఁ దెగుననియు, సంసరణసంతమసవ్యాప్తమీ దివ్యపురుషుని చింతనార్కప్రభలచే నడంగుననియు, నపవర్గనిధి యీ మహానుభావుని సమ్యగ్భజనాంజనముచేఁ గానిపించుననియు, నఖిల విబుధులుజెప్పగా విని యాశ్రయింపవచ్చితిని.

వీర:— (తనలో) వీనికిఁ బదియాతేండ్లయిన పూర్తిగ నుండునో లేదో! ఈవైరాగ్యమేమి చెపుమా! కులమునఁ దురుష్కుండై నను గడు బుద్ధిమంతునివలెఁ గన్పట్టుచున్నాఁడు.

ఈశ్వ:— (సిద్ధునిఁజూచి) ఏమిరా! నీవు మా పితామహుని నాశ్రయింప వచ్చితివా!

మ॥ జననంబందినదాదిగా నెపుడు ♦ సత్కార్యంబులే సేయుచున్
దినముల్ బుచ్చు తురుష్కవంశమున న ♦ ర్థిన్ జన్మముంగాంచి, యీ
యనఘున్ బ్రహ్మగురున్ భజింపఁగను వ ♦ హ్వా! వచ్చితే యిప్డు? మా
కను మోదంబగునే తలంపనిది, పో ♦ మ్మా! యింక నీపీటికిన్.

నీవు మాయాశ్రమమున నుండరాదు. ఎవ్వరైనఁజూచిన నవ్వుదురు. పొమ్ము పొమ్ము.

గోవిం:— ఓరీ! సత్వరముగ నిటనుండి వెడలుము.

సిద్ధు:— తుఱకనని నన్ను నిరసించుచుఁ బొమ్మనెదరేల? నేనుమఱల గృహాభిముఖుండనగుటకు రాలేదు. నేనీవీరగురుని సేవించుచు నిచ్చటనుండవలసిన వాఁడనే. నాయందు మీరుకూడఁ గరుణింపుఁడు.

పోతు:—ఏమిరా? ఇచ్చటనుండి పొమ్మని యెంతచెప్పిననువినక యేమేమో మాటలాడుచుంటివి? నీవేమి? జగదారాధ్యుఁడగు మా తండ్రిని సేవించుటేమి!

సిద్ధు:—మహాత్మా! బ్రహ్మగురుఁడు జగదారాధ్యుడని నీవేవచించితివి కదా! నేనాజగంబులోని వాఁడనుగానా? నేనీ మహనీయునిఁ బూజించి ధన్యుఁడను గాఁగూడదా!

ఈశ్వ:—తుఱకమతమనఁగా మొండితనమునకుఁ బుట్టిల్లుకదా! పొమ్మని చెప్పినవీడు వినఁడేమి!

గోవిం:—మాటలతో నీతురుష్కుఁడు పోవునట్లులేదు. (సిద్ధుని సమీపింపఁబోవును)

వీర:—కుమారా! తొందరపడవలదు.

తే॥ గీ॥ జాతి యిసుమంత గ్రహియించి ♦ స్వాంతమందు
గోపమూనెద వేటికిఁ ♦ గోవిదుండి
తండు, వచ్చినపని యేమొ ♦ తప్పకిపుడు
కన్గొనుట మనకు మిగుల ♦ ఖ్యాతి కాదె.

నీవు-నేను అనుభేదము మనవంటివారు విడువవలయును కులమును బాటింపఁగూడదు. ఏకులమైన నేమి! అందఱును సములే. అందఱును మాతృ పురీషసంకుల రసస్సంభూతులే. వత్సలారా? ఈజాతి మతాదిభేదములును, వానింగూర్చిన కలహములును జ్ఞానాభివృద్ధికిని దేశాభివృద్ధికినిఁ గారణములు కావు. ఎప్పుడు ప్రజలెల్లరు నన్యోన్య ప్రేమాను బద్ధులై యుందురో, యప్పుడు దేశమభివృద్ధిఁ బొందును. ఎప్పుడు భేదరహితబుద్ధితో నుందురో యప్పుడు జ్ఞానాభివృద్ధిగలుగును కావున నీతురుష్క బాలుఁడు మనకడకేల వచ్చినను విషయము యోచింపవలయును గదా- (సిద్ధునిజూచి) ఓయీ! భవదీయనివాసంబెద్ది! నీతలిదండ్రు లెవరు? నాకడ కేలవచ్చితివి?

సిద్ధు:— స్వామీ! ముడుమాల నా నివాసము. నా తండ్రి పీరుసాహెబు. నేను దూదేకులవాఁడ. దారాపత్య ధనాదిసంపదల శాశ్వతంబులని తలంచి, సంసారాంభోరాశిని మునుంగఁజాలక, జననీజనకులపైఁ బ్రేమనుబరిత్యజించి, భవదీయదివ్య చరణ కమలసేవఁ జేసి కృతార్థుఁడను గాఁదలంచివచ్చితిని.

మ॥ దరిజేర్పంగలవాఁడవీవనుచుఁ జి ♦ త్తంబందు భావించి. యీ
కరణిం జేరితి నాశ్రయింపనిను లో ♦ కస్తుత్య చారిత్రనీ
వర కారుణ్య కటాక్షవీక్షణసుధా ♦ వారాశివై, యింకనన్
బరిరక్షింపవె నీవుమ్రొక్కెదఁ బర ♦ బ్రహ్మాంబవీరేశ్వరా.

తే॥ గీ॥ తుఱకబిడ్డఁడువీడంచుఁ ♦ ద్రోసిపుచ్చ
కింక, పాదసేవకునిగా ♦ నెంచికృపను
రమ్యతరమైనముక్తిమా ♦ ర్గంబుఁజూపి
పుణ్యమును గట్టుకొనుమయ్య ♦ మ్రొక్కు చుంటి.

మహాత్మా! నీవుమహామహిమాస్పదుండవని నేను వినియుంటిని. నీపదసేవతప్ప, ప్రపంచమున నాకితర మేమియు వలదు. సమస్తమైనయాశలను గోసివేసి నీసాన్నిధ్యమునకు వచ్చితిని- చేపట్టి రక్షింపుము (వీరగురుని పాదములపైఁబడును.)

వీర:— (తనలో) వీనివైరాగ్యగుణము నెంతయు మెచ్చవచ్చును.

ఈశ్వ:— (సిద్ధునిఁజూచి) తుఱకవగునీకు ముక్తిమార్గము గావలయునుగా! (వీరగురునిఁజూచి) తాతగారూ! వీఁడుమాయనుగ్రహమునకుఁ బాత్రుఁడు గావలసినవాఁడుకాఁడు, వీనికేమి! బ్రహ్మవిద్యారహస్యములు జెప్పి ముక్తిమార్గముఁజూపుటేమి! వలదు వలదు. మాకిట్టిశిష్యుఁడు—

వీర:— సిద్ధా! ముక్తిమార్గముగాంచుటయన్న మాటలతోనున్న దనుకొంటివా! అదియునుగాక నీవువయసు ముదిరినవాడవు కావు. అట్టిరహస్యములఁ దెలిసికొనుటకుసామాన్యులు శక్తులు గారు. ఎన్నియోరహస్యము గ్రహింపవలయును. పరమేశ్వరునిగూర్చి ఘనమైన తపము జేయవలయును,

తే॥ గీ॥ పరమునివరులుబూని, త ♦ పంబొనర్చి
వృద్ధయోగీశ్వరులకైన ♦ విశ్వమందు
గానఁబడనట్టి ముక్తి, మా ♦ ర్గంబు తుఱక
వైననీకులభించునే ♦ యాశయేల?

అదియునుగాక, అట్టిదానింగూర్చి ప్రయత్నించుటకిది సమయము కాదు.

మ॥ వినుభోగోచితనవ్యయౌవనవయో ♦ వేళన్ శరీరోద్భవో
ద్ఘనదుస్సాధ్య తపంబునాకడనొగిన్ దా ♦ ల్పంచలంపేల, లె
మ్మనుమానింపక, పొమ్ము నీపురికి, ను ♦ ద్యన్మోదమే పారఁగా
జననీబంధులనెల్లఁ జూచుకొనుచున్ ♦ సౌఖ్యాబ్ధినోలాడుమా.

ఈశ్వ:— తాతగారూ! అట్లు చెప్పి మెల్లగా పినినానలకుఁ బంపుఁడు.

సిద్ధు:— స్వామీ! సంసారబంధమును దెగఁగోసికొని, వైరాగ్యమన
స్కుఁడనై, నీపదసేవఁ జేయుఁదలఁచివచ్చిన; ఈదీనునకు, ఈ
తురుష్కవంశసంజాతునకు- ఈనిష్కల్మషహృదయునకు- ఈ
భంగినవచించుట ధర్మమగునా!

శా॥ తారాధీశశిరోవతంసుఁడవుగా ♦ తథ్యంబుగా విష్ణుగా
సారాభీష్టము దీర్పసద్గురువుగా ♦ స్వాంతంబునం దెంచి, ని
న్నారాధించి, కృతార్థతంగనఁగ, న ♦ య్యా! వచ్చియున్నట్టినన్
బోరా! పొమ్మనిపల్కనీకుఁదగునే ♦ పూర్ణానుకంపామతీ.

దేవా! నీచిత్తము వెన్నవంటిదని యనేకులు చెప్పిరి. అట్టిచో,
నాకిట్లువచించుటకుఁ గారణమేమో యూహింపఁజాలకయున్నా
ను. నాయందేల నిర్దయవహింతువు. నీవుపలదన్న నాకుదిక్కె
వ్వరు? తండ్రీ! వీరగురుశిఖామణీ! సంసారమునురోసి వచ్చిన
నన్ను మఱలసంసారముఖునిఁ జేయఁజూచెదవేల! నాకునీవే
తల్లియుఁదండ్రియు-గురుఁడును-దైవము-సర్వమునీవేయని నమ్మి
వచ్చితిని. మహాత్మా! నిన్ను సేవించుచు నుందునుగాక! కష్ట
ములురానిమ్ము. సౌఖ్యములురానిమ్ము. గ్రహగతులు గుందిం
పనిమ్ము. రోగములువచ్చిపైఁబడనిమ్ము నీచరణారవింద సేవ
యేనాకుఁ గావలసినది- నీదివ్యనామస్మరణమే నాకు సర్వ
మంగళప్రదము.

మ॥ తలిదండ్రుల్ ఘనబంధువర్గములు, దా ♦ తల్ స్నేహబృందంబు, వే
ల్పులు నీకన్నను నాకు లేరనుచు నా ♦ లోచించి, సంసారపుర్
సిలుగుల్ జెందఁగలేక నీదుపదరా ♦ జీవంబులర్ భక్తినై
కొలునర్ వచ్చిననర్ గ్రహింపుమిఁక లో ♦ కుల్మెచ్చ వీరేశ్వరా.

స్వామీ! నా సేవకు నీవంగీకరింపవేని నీయెదుటనే ప్రాణముల
నైన విడిచెదనుగాని గృహంబునకు మాత్రముపోనను-

ఈశ్వ:—(సిద్ధునిఁజూచి) ఏమిరా! ఇంతహఠము. తురుష్కమతమును
సార్ధకము సేయుచుంటివే. సాధింపరానిసుజ్ఞానమును, సచ్చి
దానంద పరిభానమును సాధింపఁ జూచుచుంటివి.

సిద్ధు:— తల్లీ! ఈశ్వరీ! నీవుసామాన్యయోగినివికావు. సమస్త సౌభా
గ్య మోక్షప్రదాయినివైన యీశ్వరిగా గ్రహించితిని. ఆది
శక్తివి. ఇట్టిరూపమున భూమియందవతరించితివి. మీసేవ
జేయవచ్చిన నన్నుఁబరిత్యజింపవలదు. నీచుఁడని తలంపవలదు.
మీకటాక్షమున నేనుపూతచరిత్రుఁడ. నగుదును.

శా॥ వాలాయంబుగ నన్నుఁగాతురనుచుర్ ♦ భావంబులో నమ్మి, మీ
పాలన్జేరితిఁనన్ను యిప్పుడు, కృపా ♦ పాథోనిధుల్ మీరలుర్
బాలన్సేంచిన నీటముంచిననరే ♦ భారంబుమీదాట, నా
కేలా వేళొకచింత నందగను-త ♦ ల్లి! యీశ్వరీ! యీశ్వరీ.

జగజ్జననీ! ఇఁక నన్ను రక్షించు భారము మీకుఁదప్పదు.

సీ॥ తురకనైయేననువీడు ♦ వరగుణుండంచును।
జేరితాతకు వేగఁ ♦ జెప్పుమమ్మ।
పోపొమ్ముపొమ్మంచుఁ ♦ బూర్ణకోపముతో, న।
నెడుతండ్రికోపంబు ♦ నడుపుమమ్మ।

బాలుఁడయ్యును గుణ ♦ శీలుఁడై వైరాగ్య|
మందెననెడుమాట ♦ నరయుమమ్మ|
యవతారరూపులై ♦ నరులుమిమ్ముఁ జేరి |
దలఁచునాకోరికఁ ♦ దలఁపుమమ్మ||

తే॥ గీ॥ ఆశ్రయించిన వీనికి ♦ నభయమిచ్చి
యింపుమీఱఁగ వేగఁ బా ♦ లింపుమమ్మ
దీనుఁడగు వీనికింక సు ♦ జ్ఞానమిచ్చి
ముక్తిమార్గంబుఁ జూపించి ♦ బ్రోవుమమ్మ||
(పాదములమీఁదఁ బడును)

ఈశ్వ.— (తనలో) వీఁడుతురుష్కుండైనను మహాసుజ్ఞానివలె నున్నాడు. నిశ్చయముగా నీతఁడు మాతాతగారిచే ననుగ్రహింపఁబడఁదగినవాఁడే. తొలుత తురకయని పలికినయంతనే నేను తృణీకరించితిని-

వీర:— (తనలో) ఈసిద్ధుఁడు సుజ్ఞానియని నేనుగ్రహించినను, నీశ్వరి చిత్తమెట్లుండునో యనియుఁ దలఁచి యూరకుంటిని. తొలుత వీరందఱును వీనిని నిరసించిరి. ఇప్పుడునిశ్చలచిత్తమును, నిర్మలవైరాగ్యమును బ్రకటించుచు నీతఁడు పలికిన పలుకుల కీశ్వరిచిత్తముకూడ గరిగినట్లున్నది- (ప్రకాశముగా నీశ్వరిం జూచి) తల్లీ! ఈశ్వరీ! యోచించుచుంటివేమి! మహమ్మదీయ బాలుని పలుకులవింటివిక దా!

సిద్ధు:— తల్లీ! ఈశ్వరీ! మహేశ్వరివగు నీవునన్ను రక్షింపవలయును. (వీరగురునిఁజూచి) దేవా! నీవుసంశయింపవలదు. ఈసిద్ధుఁడు మీయనుగ్రహమునకుఁ బాత్రుఁడగుటకు వేచియున్నాఁడు. కటాక్షింపుఁడు- (నమస్కరించును).

ఈశ్వ:— తాతగారూ! ఈతఁడు తురుష్కుఁడేగాని, యీతని వైరాగ్యభావముఁజూడఁ గాఁ దమపాదసేవఁ జేసిన సిద్ధనామముం

సార్థకముజేసి కొనుసట్లు తోచుచున్నది. అందుచేత నీతడు తమకటాక్షమున కర్హుఁడని తోచుచున్నది.

గోవిం:— తండ్రిగారూ! పరిశీలింపఁగా వీనిముఖమున నదియొక విధ మయిన కళకనిపించుచున్నది.

సిద్ధ:— (బ్రహ్మేంద్రస్వామిని జూచి) మహానుభావా! మహామహిమ గల తమవంటి భగవత్స్వరూపులు కులభేదమును బాటింపరు. కావున నన్ననుగ్రహించి విగతపాపునిఁ జేయుఁడు,

వీర:— వత్సా! ఇటురమ్ము

సిద్ధ:— (సమీపించును)

వీర:— (సిద్ధుని శరీరముపై జేయివైచి) సిద్ధా! నీబుద్ధికిమెచ్చి నిన్ను శిష్యునిగా స్వీకరించుచున్నాను. ఇఁకఁ జింతవిడువుము.

సిద్ధ:— (సంతోషముతో)

సీ॥ ఇదికదా సుదినంబు ♦ తుదిలేని నాచిత్త
సంతాపమంతయు ♦ సమసిపోయె
నిదికదా సుదినంబు ♦ హృదయ మానందవా
రాసి నోలాడు చుం ♦ గ్గంటిఁగంటి
నిదికదా సుదినంబు ♦ కుదురుగా మదిలోన
గురుతైన సద్భక్తి ♦ నరసినాఁడ
నిదికదా సుదినంబు ♦ సదమలచారిత్రు
వీరసద్గురుని సే ♦ వింపఁ గంటి

తే॥ గీ॥ భళిర! నాభాగ్యమిప్పుడు ♦ పలుకవశమె
యెప్పటికి నేదివచ్చునో ♦ యెవ్వఁడెఱుఁగు
నఖిలజగముల కాధారుఁ ♦ డైన దేవ
దేవు లీలావినోదంబు ♦ దెలియవశమె.

(వీరగురునిజూచి) స్వామీ! నీవుదీనుఁడగు వీనిమొదలఁ జూపిన

యమూల్యమైన కరుణకు సంతసించుచున్నాను. (ఈశ్వరిఁగాంచి) అంబా! ఈశ్వరీ! నీకు నమస్కారములు. (తెరలో)

బ్రహ్మముగారి యాశ్రమమునకు దారియెట్లు? (ఇంకను కొంత దూరమునుండి) ఏమనుచున్నారు! ఆకనిపించునదిగనే వారియాశ్రమమనియా! సరే.

ఈశ్వ:— ఎవరో మనయాశ్రమమును వెదకికొనుచు వచ్చుచున్నారు సిద్ధుఁడా! ఆవచ్చునదియెవ్వరో యరసిరమ్ము.

సిద్ధు:— (లేచి యీవలకు వచ్చినయంతనే పీరుసాహెబు ప్రవేశించును)

పీరు:— (సిద్ధునిఁజూచి) నాయనా! కంటికిఁ గనిపించితివా! అబ్బా! నన్నెంత కష్టపెట్టితివిగా! నేటికి మూడుదినములనుండి నీకై యన్వేషించుచుంటిని. తుదకొకనివలన నీవిచ్చటి కరుదెంచితి వన్నజాడ నెఱిఁగి కాళ్ళీడ్చుకొనుచుఁ బడుచు లేచుచు వచ్చితిని. నీపై బెంగఁగొని మీయమ్మ నిద్రాహారములు లేకయున్నది. సత్వరముగఁ బోవుదమురమ్ము.

ఈశ్వ:— (పీరేశ్వరునిఁజూచి) తాతగారూ! ఆతఁడు సిద్ధునితండ్రివలె నున్నాఁడు.

పీర:— అవును సిద్ధుని నిశ్చలబుద్ధి యిప్పుడు ప్రకటింపఁబడును. పితాపుత్రుల సంభాషణము మనము వినుచుందము.

పీరు:—(సిద్ధునితో) మాట్లాడవేమి!

సిద్ధు:—తండ్రీ! మాట్లాడకేమి! నన్నెక్కడికిరమ్మంటువు.

పీరు:—గృహమునకు

సిద్ధు:—ఏటికి?

పీరు:—గృహమునకురమ్మని పిలిచిన నేటికని వచించెదవేల? ఇంటికిరావా?

సిద్ధు:—గృహమునకు మఱలవచ్చు తలంపుతో నేనియ్యెడకురాలేదు.

వీరు:—గృహమునకురాక, యిక్కడనుండి యేమి చేయఁదలంచితివి?

సిద్ధు:—ఇక్కడనుండి చేయవలసిన కార్యము లనేకములున్నవి. ముఖ్యమైనది తపము

వీరు:—కుమారా! నీమాటలన్నియు విపరీతముగనుండి యర్థము నేగ్రహింపఁజేయకున్నవి

సిద్ధు:— తండ్రీ! ఇటువినుము సకలమువచించెద నా చిత్తము సంసారవిముఖమైయున్నది. నేనీవీరగురుచరణారవింద సేవచేఁ గృతార్థుఁడనై ముక్తిఁబొందఁదలంచి యిట్లువచ్చితిని. నాకుసంసారవాంఛయావంతయులేదు. నిశ్చలచిత్తముతోఁ బరమేశ్వర ధ్యానము సల్పి, బ్రహ్మేంద్ర స్వామి కరుణకుఁ బాత్రుఁడనై విజ్ఞాన మార్జింపవలయును. ఇంక నీవింటికిఁబొమ్ము.

వీరు:—ఇదేటిమాట. ఇట్టి తలంపు నీకేలకలిగెను? మహమ్మదీయకులమున జన్మించిననీవు హిందూమత గురుచరణారవింద సేవఁజేయఁదలంచితివా? ఈమాట మన మతమువారు విన్నఁ బరిహాసము సేయరా! చాలుఁజాలు. అందులో నీవయస్సున నీకిట్టి యుద్యమమేమి? ఈవెట్టిమాటలమాని రమ్ము. సత్వరముగ గృహమునకుఁ బోవుదము.

సిద్ధు:— తండ్రీ! నీవు నన్ను బలవంతపఱచినందువలనఁ బ్రయోజనము లేదు. ఈజగమంతయు మిథ్య సంసారాంధకారకూపంబునఁబడుటకు నాచిత్తము సమ్మతింపదు. భాగ్యభోగములకై నామానసమాసింపదు. నాచిత్తము పరమేశ్వర చరణసరసీరుహసేవయందుఁ జిక్కియున్నది. దీనికన్యథాత్వ మింకఁ గలుగదు.

వీరు:— పుత్రకా! ఇట్టిపలుకు లెవ్వరైనవిన్న నవ్వుదురు. నీవిట్టియుద్యోగమునఁ బ్రవేశించినచో మాకుఁదిక్కెవ్వరు?

సిద్ధు:— జనకా! పూర్వజన్మబుణ సంబంధమునుబట్టి నేనుపుత్రుఁడనని యునీవుతండ్రివనియుఁదలంచుచున్నావు కాని తత్త్వము బాగుగ విచారించి చూచినచో నీవెవ్వఁడవో నేనెవ్వఁడనో! నీకును నాకును నెట్టిసంబంధమున్నది. ఇదియె తెయువట్టిమాయ. దుష్కర సంసార సంబంధమైన యిట్టి మోహమునందు బడి మూఢుల జ్ఞానవశము చేఁబరమేశ్వర ధ్యానమునకు దూరులై నరకకూప మునఁబడుచున్నారు. ఇవ్విషయమంతయు బాగుగనాలోచించి, సంసారసౌఖ్యములవలన గోరంతయుఁ బ్రయోజనము లేదని గ్రహించి నేనిద్దానికిఁ గడంగితిని.

పీరు:— (తనలో) అక్కటా! నేనిప్పుడేమి సేయుదును! వీనిచిత్తమునిం దెవ్వరు ప్రవేశపెట్టిరోకదా! (ప్రకాశముగా) నాయనా! నా మనంబున బరితాపము గల్గుటకు నీకీబోధ నెవ్వరు గావించిరి?

సిద్ధు:— ఇట్టి దొకరుచెప్పిన వచ్చునది కాదు.

పీరు:— వత్సా! ఈమాటలవలనఁ బ్రయోజనములేదు. నేనును మీ యమ్మయు నీమీదఁ బ్రాణములు బెట్టుకొని యున్నారము. మాకు నీవేదిక్కు. నీవిట్టియుద్యోగమునఁ బ్రవేశింపనుంటివను వార్తమీయమ్మ వినినచోఁ బ్రాణములతో నిలువఁగలదా! నీకు వివాహము సేయుటకుఁ గూడఁ బ్రయత్నించుచుంటి మే

మ॥ తనయా నీశుభజన్మ మూలమున నే ♦ ధన్యుండనై తింకఁ గ
న్ననసీవాక్కు తలోదరీమణిఁజగ ♦ న్మాన్యన్ సుచారిత్రమో
హనగాత్రిన్ ముదమారఁగైకొని యప ♦ త్యంబందిధాత్రీతలం
బునమద్వంశము వృద్ధిసేయుము మహా ♦ పుణ్యంబు జేకూరెడున్.

సిద్ధు:— తండ్రీ! సంసారమునందే పరాఙ్ముఖత్వమువహించి కేవలము విరాగినై బ్రహ్మగురు పదపద్మారాధనమున దినములుగడుపఁ దలంచివచ్చిన నాకు వివాహమా? ఆహా! ఎట్టిమాటఁజెప్పితివి! నాయనా! సంసారమువలన సౌఖ్యమున్నదనియే నీవు తలంచు

చుంటివా! ఇటువినుము.

మ॥ అమలాంగిన్ వరియింపఁ జింతయు నప ♦ త్యప్రాప్తికై చింత, కూ
టమి మెండైన భరింపఁ జింత,కడు జా ♦ డ్యగ్రస్తతన్ జింత క
ష్టము ప్రాప్తించిన జింత యీ యిడుములన్ సారించు సంసార కూ
పమునన్ మున్గెడువారికెల్లనివి సం ♦ ప్రాప్తించు జుమ్మీ భువిన్.

జనకా! వివాహము సౌఖ్యము ధనార్జనము మొదలగునవి యన్నియుఁ గేవల మిహలోక సౌఖ్యము లనుభవింపఁగోరు నజ్ఞానుల కేగాని, సర్వమునురోసి పరబ్రహ్మజ్ఞానము వడసి ముక్తిఁబొంద వీర సద్గురుచరణ సన్నిధికిఁ జేరిన నావంటి విరాగి కవసరము లేదు. సంసార బంధమునఁ దగుల్కొనియున్న మూఢులను జూచిన నాకు విచారము గల్గుచున్నది-

సీ॥ మాయదేహంబది ♦ మట్టిబొమ్మయొకదా
కన్నులన్ దిలకించి ♦ కలువలనుచు
దుర్గంధకలితమై ♦ తోచు శరీరంబు
మేల్మి బంగరువన్నె ♦ మించుననుచు
మాంసంపు ముద్దలౌ ♦ మగువ గుబ్బలఁజూచి
మత్తమాతంగ కుం ♦ భములటంచు
మూత్రంపు తిత్తియౌ ♦ పురువులుండు బిలంబు
దివ్యమౌ మదన మం ♦ దిరమటంచు
తే॥గీ॥ దలఁచి కామాంధులై హరిన్ ♦ దలఁపకుండ
జగమునెల్ల మరచి యదే ♦ సౌఖ్యమనుచు
నమ్మి భయద సంసార కూ ♦ పమ్మునందు
మునిఁగి తపియించు చుందురు ♦ మూఢులకట.

మోహమును జయించినవాఁడే ధన్యుఁడు. దానింగెల్చినచో విజ్ఞానమలవడును. విజ్ఞాన మలవడెనేని సంసార పరాఙ్ముఖత్వము గలుగును. అట్టిది కలిగెనేని తపశ్చరణమున బుద్ధి ప్రవేశించును. దానివలన

బరమేశ్వరానుగ్రహము బడయవచ్చును. ఈ శరీరమొక రథము. బుద్ధియే సారథి. ఇంద్రియగణమే హయములు. బుద్ధియను సారథి యింద్రియహయములను బిగబట్టి శరీరరథమును సరియైనమార్గమున నతిజాగరూకతతో నడిపింపవలయును. సారథి యేమాత్రమజాగ్రత్తగ నున్నను నప్రమత్తత్వము దెలిసికొని యింద్రియ హయములు రథమును బడఁగొట్టి జీవుఁడను రథికునినరిషడ్వర్గశత్రు మధ్యమునఁగూల్చి వేయును.

సీ॥ గిరిజా మనోహరు ♦ చరణసేవను జేయు
భక్తుండు సేయునే ♦ పరులసేవ
సర్వేశు నుతియింప ♦ సంతసించెడు జిహ్వ
వర్ణింపఁ దలచునే ♦ పద్మముఖుల
రజతాద్రివాసునిఁ ♦ బ్రణుతించు చేతులు
గ్రాలునే కాంతల ♦ కౌగిళులను
గరళకంఠునిఁజూచు ♦ కన్నులు జూచునే
విరిబోణుల ముఖార ♦ విందములను
తే॥గీ॥ జగము సకలంబు మాయగా ♦ స్వాంతమందు
నరసి ఘోరశత్రువుల నా ♦ ర్వురజయించి
విమల విజ్ఞానమార్గింప ♦ వీరగురుని
జేరు నాకేల ఘోర సం ♦ సారవాంఛ.

వీరు:— అక్కటా! ఈ బాల్యమునందింత వైరాగ్యమా! నాయనా గృహమునకు రావా! నీమీదఁ బ్రాణములు పెట్టుకొని యున్న మాయాశ నిరాశఁజేసి మమ్ము ఘోరచింతా సముద్రమునందు ముంతువా! నీవు జన్మించినప్పుడు “పైగంబరులు” నిన్నుఁజూచి యీతఁడొక గొప్ప మహానుభావుండగునని చెప్పిరి. ఆమాటలకు నేను నీవొక గొప్పవాడవగుదువని తలంచితినిగాని యీ మహానుభావతత్వ మీతీరునఁ బరిణమించునని తలంప లేదు. నీకువివాహాది కార్యములఁజేసి యానందించు భాగ్యము

నాకున్నదని తలంచితినే! యుక్తవయస్కుండవగు నీవువృద్ధుఁడ నైన నన్నుఁ గూర్చుండఁబెట్టి సుఖముగా సంసారరథమును నడుపుదువని తలంచితినే. అట్టి నాకోరికలన్నియు నడుగంటఁ జేసితివా! హా! కుమారా! ఇక నాకుదిక్కెవ్వరు? నీయుదంతము విన్నచో మహాదుఃఖితప్తయగు నీతల్లికేమనిచెప్పి యూరడింపగలను? ఆమె ప్రాణంబులతో నిలుచునా!

మ॥ నవమాసంబులు మోసి మోసి కని, నా ♦ నాకష్టముల్ బొంది శై
శవ జన్మోత్కట బాధలన్ సయిచి, మో♦కుంబీవె యంచెంచి పెం
చి వినోదించిన తల్లికిట్టివగపుల్ ♦ జేకూర్చేదే యిట్లు నీయవి
వేకంబున కేమిచెప్పుదుఁ గుమా ♦ రా! కర్మమిట్లొప్పెనే.

ఈశ్వ:— (తాతగారినిజూచి) తాతగారూ! ఈసిద్ధుని తండ్రివాక్యములు వినుచుంటిరా! తండ్రి దీనాలాపములకు వీనిచిత్తము గలుగక యుండునా?

వీర:— అమ్మా! ఈశ్వరీ! ఇఁకసిద్ధుని మఱల సంసారముఖునిగా నొనర్చుటకు బ్రహ్మకైనను దరముగాదు. కాని, యీతండ్రి యీవిధమున నట్లు దీనతతోఁ గుమారునిరమ్మని పిలచుచుండఁగా మనముచూచియు నూరకుంటిమని యీతఁడు తలంచును గావున మనముగూడ సిద్ధునకుఁ దగినవిధమునఁ జెప్పుట మంచిది. (సిద్ధునిఁజూచి ప్రకాశముగా) సిద్ధా! నీ భక్తిజ్ఞాన వైరాగ్యములకు నేను మిగుల సంతసించితిని. కాని నీతండ్రి పలుకులువిన నాకును జాలియగుచున్నది. నీవు బాలుండవు. సంసార సౌఖ్యములనేమియు ననుభవించి యుండలేదు. భగవత్కరుణనార్జించుటకుఁ గేవలముయోగియేయైయుండనవసరము లేదు. గృహస్థాశ్రమమందుండిగూడ భగవంతుని యనుగ్రహమునకుఁ బాత్రుఁడు కావచ్చును. ఈయాచారము పూర్వకాలమునుండియు వచ్చుచునేయున్నది. సానగ సనాతనాత్రి

వశిష్ఠ జమదగ్న్యాది ఋషిపుంగవు లనేకులు గృహస్థులై యుండియే తపోవృత్తినుండిరి. ఇంతయేల? నేనుగూడ నట్టి యాశ్రమమునందే యుంటిని. కావున నీవు నీతండ్రిచెప్పినట్లు గృహస్థాశ్రమము స్వీకరించి తనయులఁగాంచి పితృదేవతలకు సద్గతిఁగూర్పుము. ఇదియట్లుండ పితృవాక్య పాలనముకన్న సుతుం డనుష్ఠింపఁదగిన మఱియొక ధర్మములేదు. ఈధర్మము ననుసరించియే మున్ను శ్రీరామచంద్రుఁడు సమస్తరాజ్య శ్రీలను, భోగంబులను బరిత్యజించి, నిజకాంతంగూడి యరణ్యములకరిగెను. భీష్ముఁడు గుర్వర్థము వివాహము మానెను. పరశురాముఁడు తండ్రియాజ్ఞ ననుసరించి తల్లియగు రేణుకను వధించి, మఱలఁ దండ్రి యనుగ్రహమునకు బాత్రుఁడై యామెను బ్రతికించి శుభంబులఁ బడసెను. పురాణముల యందిట్టి మహనీయుల చరిత్రము లనేకములున్నవి. కావున నీతండ్రి వాక్యము ననుసరింపుము. శుభంబుల నందఁగలవు.

సిద్ధు:— గురువర్యా! మీకుగూడ నీతెఱంగున నచించిన నే నేమందును.

తే|గీ|| సారహీనమౌ ఘోర సం ♦ సారవార్ధి
మునుఁగఁ జాలక యేకదా ♦ పుణ్యమూర్తి
వైన నిన్నాశ్రయించితి; ♦ నధికభక్తి
మఱల నీరీతి బోధింప ♦ మాన్యమగునె.

స్వామీ? మీయనుగ్రహమున మీకు శిష్యుండనైతిని. మఱల నాచిత్తము సంసారాభిముఖమగునా? అందునకు సమ్మతించునా? అట్లెన్నటికిని జరుగనేరదు. మీరునన్ను శిష్యునిగా నేలఁ గరుణింపకున్నచో, మీచరణసన్నిధిని బ్రాణములనయినఁ బరిత్యజించెదను గాని గృహాభిముఖుండను గాను. ఇది ముమ్మాటికిని నిశ్చయము.

ఈశ్వ:— (తనలో) మహాత్ముఁడీయుఁడైనను వీనికిట్టిభక్తి జ్ఞానవైరాగ్యము లెట్లలవడినవో కదా? ఇఁక వీనిచిత్తము సంసారాయత్తముగాదు.

వీర:— (ఈశ్వరినిజూచి రహస్యముగా) ఈరీతిని జరుగునని నేను నీకు జెప్పియుంటినిగదా! ఈసిద్ధుడిప్పు డిట్లున్నను ముందు ముందు మహా మహిమనుగల యొకసిద్ధుఁడు కాఁగలఁడు. ఇంతకుఁ బూర్వము రెండుజన్మముల నుండియు నీతఁడు మదీయ శుశ్రూషనే యొనరించుచున్నాడు. ఈజన్మమునఁగూడ నట్లేయయ్యెను.

ఈశ్వ:— మీ యమూల్య కరుణావృష్టి మీతనిపైఁ గురిసెనేని యట్టివాఁడగుట కేమి సంశయముండును?

వీరు:— (సిద్ధునిఁజూచి) కుమారా! నామాటలకేమని ప్రత్యుత్తర మిచ్చెదవు?

సిద్ధు:— దేనికి,

వీరు:— ఇంటికి రమ్మను మాటకు

సిద్ధు:— ప్రత్యుత్తర మిచ్చియుంటినికదా!

వీరు:— ఏమని?

సిద్ధు:— రానని,

వీరు:— హా! నేనెంత నిర్భాగ్యుఁడను! ఇంక నేనెట్లు బ్రతుకుదును!

సీ॥ వంశపావనుఁడైన ♦ వరపుత్రుఁ డేడంచు
నడుగు మీయమ్మకే ♦ మనెదువాఁడ
నినుఁ జూడలేకున్న ♦ నిమిషమోర్వని నీదు
చెల్లెండ్ర కేమని ♦ చెప్పువాఁడ
కులవర్ధనుండైన ♦ కొడుకు రాఁడేమని
యడుగు బంధులకేమి ♦ నుడువువాఁడ

మా హితుండేడని ♦ మాటిమాటికివచ్చు
ప్రాణమిత్రులకేమి ♦ పలుకువాడ
తే॥గీ॥ నకటా! కుమారా! విప ♦ దాబ్ధి నన్ను
ముంచితేయిట్టు లికనెందు ♦ బోవువాఁడ
దొల్లి నేఁజేసిన సుకృతి ♦ స్తోమమిట్లు
బరిణమించె నటంచును ♦ వగచువాఁడ.

సిద్ధు:— తండ్రీ! నీవు నాపై ననురాగమును విడువలేక యేల విలపించె దవు. దీనివలనఁ బ్రయోజనములేదు. నీవు నన్ను సంపూర్తిగ మఱచిపోవలయును.

చ॥ కనులనీరుగారఁగొడు ♦ కా! కొడుకాయని యేడ్చెదేల! యీ
తనువులు శాశ్వత్వంబులె, వృ ♦ థా, మదిఁగాంక్షలుగాని, బాగుగా
మనమున యోచనల్ సలిపి ♦ మానుగఁజూచిన భ్రాంతులన్నియుల్
ఘనముగ బోవునయ్య జన♦ కా! చనుమా! యనుమాన మేటికిన్.

తండ్రీ! నీవునన్నుఁగూర్చి చింతింపవలదు సుజ్ఞానమార్జించి, సచ్చిదానంద పరబ్రహ్మపదవిని గాంచ బ్రహ్మేంద్రస్వామి నాశ్రయించిన నాచిత్తమిఁక దిరుగదు. నాయుద్యమమునకు నీవుభంగము గలిగింపవలదు. నాపైనున్న ప్రేమ నాచెల్లెండ్రపైఁ బఱపుము. మా యసంసారమగుటచేతను, నబలయగుటచేతను, విజ్ఞాన సంపన్నురాలు గాకపోవుటచేతను, నాతల్లితనయుఁడనగు నాపైనున్న వాత్సల్య లతనుఁ ద్రెంపఁజాలక పరితపించుచున్నమాట నిశ్చయమే. పురాకృత సుకృతంబున నీకుమారుఁడు దివ్యజ్ఞానసంపన్నుఁడుగాఁ దలంచి భగవత్స్వరూపుఁడగు బ్రహ్మేంద్రస్వామి నాశ్రయించినాడని తెలిపి, శోకమునందకుండ ధైర్యముజెప్పుము. నీవుసకల శుభములను బడయఁగలుగుదువు.

వీరు:— నీవునాకన్నులయెదుట లేనప్పుడు నాకుశుభములతో నేమిపని యున్నది? "అభములు" తో నేమిపనియున్నది. (తనలో) ఇంక నిక్కుమారుని నెంతబ్రతిమాలినను బ్రయోజనములేదు. వీని

చిత్తము సంపూర్తిగాఁ దిరిగిపోయినది. ఇఁక నేఁ జేయఁదగిన కార్యమేమియు లేదు. నాకంఠమునఁ బ్రాణములున్నంతవఱకు నీతఁడెచ్చటనున్నను జూచుచుందును. (బ్రహ్మేంద్రస్వామిని జూచి) స్వామీ! బాలుఁడైన యీతఁడు వైరాగ్యమనస్కుఁడై మీచరణము లాశ్రయించినాఁడు. ఇక నేనీవిషయమును గూర్చి విచారించినందువలనఁ బ్రయోజనము లేదు. దైవ మీ తెఱంగున నాయందుఁ గృపవహించినాఁడు. మహానుభావా! ఇఁక నేనరిగెదను. వంశవర్ధనుండని మెంచి మాచేనతిగారాబంబునఁ బెంపఁబడిన యీకుమారుని; ఒక్క నిమిషముకనుపింపక యున్నచోఁ దల్లిఁ బెంగగొను నీ కుమారుని; శాంతగుణుండని యిరుగుపొరుగువారి వినుతికిఁ బాత్రుడైన యీకుమారుని; భగవత్సేవాపరుఁడై సంసారవిముఖుఁడై జగన్నుత ప్రభావ సంపన్నుఁడవగు నీపవిత్రచరణ సరోజములాశ్రయించిన యీ కుమారుని; నేడు మీవశము జేయుచున్నాను. సమస్తధర్మముల నెఱింగిన మహానుభావులగు మీకు నేను వచియింపఁ దగినవాఁడఁ గాను. కాని పుత్రప్రేమను విడనాఁడజాలక విజ్ఞప్తిఁ జేసికొనుచున్నాఁడ. ఇఁక నీతఁడు మీకుమారుఁడుగాని నాకుమారుఁడుగాఁడు. మీకుమారులపై, మీమనుమరాలును, నీశ్వరీ సదృశయునగు నీశ్వరాంబపైనుంచు ప్రేమ నీతనిపై నంచఁ గోరెదను. ఇంతకంటె నేను మిమ్ముఁ బ్రార్థించవలసిన విషయము మఱియొక్కటి లేదు. వీనివిషయమై మీరు నాకువాగ్దానమిచ్చితిరేని, సుఖముగా నింటికిఁబోయెదను.

వీర:— తురుష్కవర్యా! విధికృతమును నెవ్వరును దప్పింపఁజాలరు. కాకున్నచో నింతబాల్యమున నిట్టివైరాగ్య మెవ్వరికైన నలవడునా? నీకుమారుని హృదయము నిర్మలమైనది. నిష్కలంకమైనది. భక్తిజ్ఞాన వైరాగ్య పరిపూరితమైనది. ఇట్టివీనిచిత్తమును తన యుద్యమమునుండి యెవ్వరును ద్రిప్పఁజాలరు. ఈతఁడుముందు

ముందుమహాయోగీశ్వరుఁడై సకలార్యస్తుతిపాత్రుఁడగును. కావున వీనింగూర్చి నీవుబెంగఁగొనవలదు. మాశిష్యుఁడగు వీనికెట్టి కొఱంతయు గలుగదు. నీవుసుఖముగా గృహంబునకుఁబొమ్ము.

వీరు:— స్వామీ! సెలవుదీసికొందును అనుగ్రహించుఁడు. (తక్కినవారింగాంచి) సిద్ధునిమీతోఁబాటు కాపాడుడు— (సిద్ధునిఁ జూచి) వత్సా! ఇఁక నేఁబోయెద—నీవెట్టి యాశ్రమమునందున్నను, మాదేహమునఁ బ్రాణములున్నంతవఱకు మాయోగక్షేమములు విచారింపుము. నీవెంతచెప్పినను పుత్రవాత్సల్యమును మాత్రము విడువజాలను. కానిమ్ము భగవంతుఁడున్నాఁడు.

(నిష్క్రమించును)

ఈశ్వ:— తాతగారూ! సిద్ధునిచిత్తమచంచలమైనది.

గోవిం:— తండ్రిగారూ! స్నానమునకు వేళయైనది దయసేయుఁడు.

(అందఱు నిష్క్రమింతురు.)

# వీరబ్రహ్మయోగి.

## ద్వితీయాంకము.

---

రంగము:— [సిద్ధపురమున- సిద్ధుఁడు- భగవన్నామస్మరణ సేయుచుఁ బ్రవేశించుచున్నాడు.]

శ్లో॥ శ్రితరక్షక గుణభూషిత సకలాంతరనివసే
స్మరహంతకమునిభావిత చరణాంబుజయుగళే
కరుణాకర శుభనామక నిగమాంచితవినుతే
గురునాయక గురునాయక శరణంతవచరణే ॥

శ్లో॥ విజితేంద్రియ విబుధావన కరుణామృతజలధే
వరచిన్మయ జగదోన్మయ, మునిరంజితహృదయే
దురితాంతక, రిపుహంతక, పతితాత్మకవరదే
గురునాయక గురునాయక శరణంతవచరణే ॥

వీరసద్గురుసేవ! ఆహా! మహాప్రభావయుతము. సంతతానందశోభితము. జగజ్జేగీయమానము. అరిషడ్వర్గలతికావితానమును ఖండించుటకు దానికంటె మఱియొక సాధనములేదు. (ఇటునటుజూచి) ఓహో! ఇదిసిద్ధపురము. తురుష్క పాలితనగరము. మార్గాయాసమున డస్సియున్న నేనీదినమున నాప్రయాణమాపి, యీపురమున విశ్రాంతి గైకొందునుగాక! ఈపురంబున నెక్కడఁజూచినను దురుష్కులే యెక్కుడుగఁ గన్పట్టుచున్నారు. నావేషమునుజూచి వీరెట్టి యకృత్యములను జేయనెంచరుకదా! (ఇంచుక యూరకుండి) నాకిట్టి సంశ

యముతో నేమిపనియున్నది. వీరేశ్వరగురు కృపావర్ధిష్ణుఁడనగు నాకో, కరివలన భయంబేలయొదవును. (ఎదుటఁజూచి) ఎవ్వరో యిరువురు పురుషు లిట్లువచ్చుచున్నారు. (పరికించి) ఓహో వీరు తురుష్క భటులవలెనున్నారు. ఎవ్వరయిన నాకేమి?

( అంత జాఫర్ ఖానుఁడు గులాం అను నిరువురుభటులు ప్రవేసించుచున్నారు. )

జాఫర్ —(సిద్ధుని నుద్దేశించి) అరే గులామల్లీ వీడెవఁడో మనపురము నకుఁ గ్రొత్తమనిషివలెనున్నాడు. వేషముఁజూచి చిన్నపిల్లలు భయపడుదురేమో! పిచ్చవాడు కాడుకదా!

గులాం— వెఱ్ఱివాఁడుమాత్రముకాడు. హిందూ పైగంబరువలె నున్నాఁడు.

సిద్ధు:— 1. శ్రీకరంబుగ భక్తజనులను
ప్రాకటంబుగ నేలునట్టిది వీరనామం॥

2. సంతతానందమిచ్చుచు
వింతగల్గజేయును వీరనామం॥

3 షడ్గుణంబుల ద్రుంచివైచుచు
నిర్గుణంబుల గూర్చును వీరనామం॥

4. భక్తజనులకు కల్పమౌచును
ముక్తిగూర్చును వీరనామం॥

5. సిద్ధమౌచును బుద్ధమై ఘన
సిద్ధసేవితమైనది వీరనామం.

(తురుష్క భటులిరువురును సిద్ధుని సమీపింతురు)

గులాం:— (సిద్ధునిజూచి నీవెవరవు?

సిద్ధు:— నేనే!

గులాం:— అనఁగా,

సిద్ధు:— అంతకంటె నేను ప్రత్యుత్తర మీయఁదగిన దేమున్నది?

గులాం:— నీకులము,

సిద్ధు:— కులగోత్ర భేదరహితుడను

జాఫ:— నీకుఁ గులగోత్రములు లేవా!

సిద్ధు:— జన్మించినదాగగ గొంతకాల మట్టివి యుండెను. గాని మధ్య మునఁ బోయినవి. పోనిండు. మీకిదియంతయుఁ దెలియదు. నేను తురుష్కుడను.

గులాం:— అట్లయిన నిది యేమి వేషము! మొగమునిండను శరీరము నిండను ఈ బూడిదయేమి!

సిద్ధు:— అదియొక బూడిద ఇదియొక వేషము. రెంటికిని సరిపోవల యును గదా?

గులాం— తురుష్కుఁడనని చెప్పితివే!

సిద్ధు—అవును-అసత్యమేల చెప్పుదును!

జాఫర్—మహమ్మదీయుఁడవైన నీవీ వేషము ధరించితి వేల?

సిద్ధు—పిచ్చివేషము. భక్త వేషము, గురునియాజ్ఞ ననుసరించిన వేషము, వేషములలోకెల్ల నానందముగనుండు వేషము, గర్వరహితమైన వేషము, -నీవు- నేను- అను భేదమును పాటింపని వేషము.

గులాం—నీకు వెఱ్ఱియున్న దా యేమి!

సిద్ధు—ఉన్న విశేషమేయది నాకు వెఱ్ఱి మీకు వెఱ్ఱి. జగమంతయు వెఱ్ఱి. ఆ వెఱ్ఱితనములోఁబడి కొట్టుకొనుచుండుటచేతనే, నీ వెవ్వఁడవు నే నెవ్వడను-అని యడుగవలసివచ్చుచున్నది.

జాఫర్—నిజముగా నీవు వెఱ్ఱివానివలెనేయున్నావు. తురకనని చెప్పి తివి. హైందవుల వేషము ధరించితి వేల!

సిద్ధు—ఇందునకుఁ గారణము భగవదాజ్ఞ. జగము సర్వము నాయన వశముననుండును. నీవును నేనును దీనికి గర్తలముకాము.

గులాం—ఈవెఱ్ఱిమాటలుమాని యీవేషము తీసివేయుము. ఇది తురుష్కులరాజ్యము-నీకుఁ బ్రాణములుదక్కవు.

సిద్ధు—ఎవరిరాజ్యమైన మాకేమి! మావంటి సాధువులకు లోకముతోఁబని లేదు.

జాఫ:— అరే పెంకితనముగా మాటలాడుచున్న వీనిని మనమువిడువరాదు. (సిద్ధునిజూచి) నీమెడలోనున్న యీపూసలు మొదలగు నవితీసి, మొగమునిండనున్న యీబూడిద తుడుచుకొనెదవా లేదా?

సిద్ధు:— విశేషముగ మాటలాడక పొండు.

గులాం:— అరే! జాఫర్ మహమ్మదీయుడైయుండియు హిందూమతమును స్వీకరించిన వీనిని మనము నవాబుగారి ముందఱఁ బెట్టవలయును (సిద్ధునిజూచి) మానవాబుదగ్గఱకు రమ్ము. లెమ్ము.

సిద్ధు:— మీనవాబుతో నాకుఁ బనియేమున్నది?

గులాం:— నీవురావా?

సిద్ధు:— రాను

గులాం:— నిన్ను బలవంతముగఁ దీసికొని పోయెదము.

సిద్ధు:— మీది మనుష్యబలము. మాది దైవబలము. ఆత్మబలము. ఇవి ప్రవర్తింపఁబడఁ దగినవే.

గులాం:— లెమ్ము-

సిద్ధు:— ఎక్కడికి-

గులాం:— పాదుషాగారి యొద్దకు.

సిద్ధు:— రానని యింతకుమున్నే చెప్పియుంటినిగదా! సాధువులు-రాజులను జూచుటకుఁ బోవలయునా? పొండు పొండు. ఈమాటలతో బ్రయోజనము లేదు.

మ॥ స్థిరభక్తిన్ మదినిల్పి వీరగురునిన్ ♦ సేవింపుచున్ సచ్ఛుభా
కర విజ్ఞానముగాంచి యెట్లయిన మో ♦ క్ష ప్రాజ్య సామ్రాజ్యసుం
దరినిం గాంచఁదలంచు తాపసుఁడు మీ ♦ ధ్యాత్రీశ్వరుంగాంచ నె
క్కరణిన్ వచ్చును, భోగభాగ్యములకున్ ♦ గాంక్షించువానింబలెన్.

గులాం:—నీవు మాటలతో రావు. ముందు మొగమునకున్న బూడిద చెఱుఁపు (బలవంతముగాఁ దుడుచుచున్నాఁడు)

సిద్ధ:— సాహసము వలదు. దీనివలన మీకు హానికలుగును. అనవసరమైన కార్యమునకుఁ గడంగకుఁడు.

జాఫ:— ( రెండవవానింజూచి )

చూచుచున్నందువలనఁ బ్రయోజనము లేదు. మహమ్మదీయ మతమున జన్మించినవాడయ్యును, మన "కురాన్"-లోఁ జెప్పఁబడిన ధర్మములనువిడిచి హిందూమతధర్మముల ననుసరించుచున్న యీ దుర్మార్గుని:— పాపచరిత్రుని:— ఈదుష్కర్ముని మన మౌలికదగ్గిఱకు గొనిపోయి కఠినముగ శిక్షింపజేసిన గాని వీఁడిమతమును విడువఁడు. అల్లా! ఇది యేమి! లోకమంతయు మహమ్మదీయమతమైయుండిన బాగుండునని మనవారందఱు చూచుచుండఁగా వీఁడు మనమతమునువిడిచి సన్యాసి వేషము వేసికొని "వీరనామం" "వీరనామం" అని పలుకుచు బయలుదేరినాడు. ఛీ! ఇట్టివానిని మనము విడువగాదు (సిద్ధునిబట్టుకొని) రమ్ము- (లాగుచున్నాఁడు.)

సిద్ధు:— మీకు వినాశకాలము సమీపించినది.

గులా:— వీనిని నక్కడవరకు గెంటుకొనిపోయి, తరువాత కట్టితీసికొనిపోయి పాదుషామునకుబెట్టుదము. (సిద్ధునిమెడపై జేయివైచి) మామాటలు నీవువినవుగా-పద-పద- (సిద్ధునిగెంటుకొని పోవుచు- జాఫరుతో నిష్క్రమించుచున్నారు.)

రంగము:— ( ప్రవేశము- సభాభవనమున- నవాబుప్రవేశము )

నవా:— (తనలో) నేఁడేమికారణముననో నాచిత్తమంతయు నదియొకవిధముననున్నది. కొన్నిదినములనుండి యదియేమికారణమో చిత్తము రాజకార్యములయందుఁగూడ వర్తించుటలేదు. (ఎదుటజూచి) ఏమది ! భటులెవ్వరో యొకనిని బంధించుకొని వచ్చుచున్నారు.

(బంధింపఁబడిన సిద్ధునితో- గులామల్లీయు- జాఫర్ ఖానుడును ప్రవేశించుచున్నారు.)

నవా:— (భటులనుజూచి) ఈతడెవ్వరు ! ఈతనినేల బంధించుకొని వచ్చినారు?

గులా:—దేవా! ఈతఁడు తురుష్కుడైయుండియు హిందూమతమును స్వీకరించి, తదనుగుణమైన సన్యాసివేషమునఁ దిరుగుచున్నాడు. హిందూమతమును విడువుమని చెప్పితిమి. కాని మామాటలు వినకయున్నాఁడు.

(ఆశ్చర్యముతో)

నవా:— అల్లా! ముసల్మానుఁడు— ఏమేమీ ! హిందూమతమును గైకొనెనా ! ఆశ్చర్యము ! ఆశ్చర్యము ! ఇట్టివింత నేను మున్నెప్పుడును జూచియుండలేదు. (సిద్ధునిజూచి) నీవుతురుష్కుడవా!

సిద్ధు:— ఓతురుష్కకులప్రదీపా ! నేను నిశ్చయముగాఁ దురుష్కుఁడనే కాని, గురుకటాక్షమున హైందవమతధర్మముల ననుష్ఠించుచు, నిట్లు యోగినై చరించుచుంటిని.

నవా:— అవి మతవిరుద్ధమని యెఱుంగవా?

సిద్ధు:— ఎఱుంగుదును.

నవా:— ఎఱిఁగియుండియు నిట్లన్యమతస్వీకార మొనర్చితివేల?

సిద్ధు:— మహమ్మదీయమతమునందు ద్వేషముండిగాని, యందసందర్భములేమైనయున్నవనిగాని, నేను ఈ యార్యమతమును స్వీక

రింపలేదు. ప్రపంచమున నేను ద్వేషింపఁదగిన వస్తు విద్దియును లేదు.

సీ॥ తనకీర్తిచంద్రికల్ • ఘనముగాఁ గాయఁగా,
నల "ఫిరోజిష" యేలె • నవనితలము
అమల యశంబంద • నౌజలాలుద్దీను,
రక్షించిమించెను • రాజ్యలక్ష్మి
అనుపమానంద ద • యాబ్ధియై యక్బరు
భూచక్రమేలెను • బాలుపుమీఱ
మతభేద మింతయు • మది దలంపక యేలి
నారలు గోల్కొండ • వారు భువిని
తే॥ గీ॥ మహ్మదీయుల మన్నంత • మాత్రమున నె
ద్వేషమేటికిఁ బుట్టును • పృథ్వినాథ
వారు వీరును సోదర్య • భావమునను
బరగవలెనంచు నెంతు మా • వంటివారు.

మతసంబధమైనవిషయముల నవ్వాలకు బాఱఁదోలి కేవలము విరాగినై, మోక్షేచ్ఛను, సద్గురు చరణారవిందంబుల నాశ్రయించి చరించుచు, మార్గవశమున విశ్రాంతిఁగైకొనుటకు నీపురంబున నాగితిని. అట్టి ప్రాపంచికసౌఖ్యపరాఙ్ముఖుఁడనగు నన్ను, మతభేదరహితుండనగు నన్ను, నిరంతర వీరేశ్వర సద్గురు చరణారవింద భజనారతింపపరుఁడనగు నన్ను నీభటులకారణముగ బంధించి యిమ్యోడకుఁ గొనితెచ్చిరి. వీరునాపై రోషించి కట్టితెచ్చిరనిగాని, దూషించిరనికాని నాకావంతయు నాగ్రహములేదు. ఇట్టివన్నియుఁ బురాకృతకర్మఫలము ననుసరించిసంప్రాప్తించుచుండును. కష్టములకు దుఃఖింపక సౌఖ్యములకు సంతోషింపక నిరంతరానందచిత్తుఁడై మెలఁగువాఁడే ధన్యాత్ముఁడు. అతఁడేనిశ్చయమైన యోగి. ఓతురుష్కసార్వభౌమా! నీభటులుసదయాంతరంగులై నాకుఁ గూర్చిన యీబంధనములునన్ను బాధింపఁజాలవు. సద్గురుకటాక్షము న్నంతవఱకీసిద్ధున కెంతును భయంబొదవదు. వీరబ్రహ్మేంద్రస్వామి

యనుగ్రహమున నేను బంధవిముక్తుఁడనగుచుంటిని. చూడుము. (తురుష్క భటులచే సిద్ధునకుఁ గట్టబడిన త్రాళ్ళు తెగిపోవును)

నవా—(ఆశ్చర్యము నభినయించుచుఁ జూచి తనలో) ఆహా! ఈతని ప్రభావమత్యద్భుతముగోలువుచున్నది. మా పైగంబరులలోఁ గాని, ఫకీరులలోఁగాని యిట్టి మహనీయుని నేనెందును జూచి యెఱుంగను. ఈతని ప్రభావము గనుంగొనఁజాలక నాభటు లెగ్గుజేసినను, గ్రోధచిత్తుఁడు కాఁడయ్యెను. మహానుభావుల హృదయమిట్లేయుండునుకదా! (ప్రకాశముగా) యోగిపుంగవా! నీకు సలాము లొనర్చుచున్నాను. (సలాముచేయును)

సిద్ధు—(సలామునందుకొనక) ఇఁక నేను పోయివచ్చుట కనుజ్ఞ నిచ్చెదవా!

నవా—మహాత్మా! మీరట్లు సెలవిచ్చుటకు నేనెంతవాఁడ. ఈభాగ్య భోగములు స్థిరములనినమ్మి సంసారకూపమునఁబడి, దురాశచేఁ బీడింపఁబడుచు, అన్యమతములయం దసహనబుద్ధికలిగి దుష్కర్మరతుండనై యున్న నాకుఁ దమవంటి దివ్యపురుషుల మహామహిమ తెలియునా! స్వామీ! ఒక్క విషయము మి మ్మడుగుచున్నాను. మన్నించి ప్రత్యుత్తరమీయఁ గోరెదను. అజ్ఞానముచే నావరింపఁబడి నాభటులు మీకెగ్గుసలిపిరి. అందున నేను పశ్చాత్తాపమునంది భక్తిమీఱఁ దమకు సలాములొన ర్చితిని. తాము నాయెడల దయబూని నాసలాము లేలయందు కొనక యుంటిరి?

సిద్ధు:— తురుష్కాగ్రణీ! ఒకరు మావంటివారికి నమస్కరించినను నమస్కరింపకపోయినను వారియెడల మాకుభేదబుద్ధి యావం తయుఁ గలుగదు. కాని యొక్క విశేషము మాత్రమున్నది. వీరబ్రహ్మేంద్రస్వామి సత్కరుణకుఁ బాత్రులైన శిష్యులెవ్వ రును బాహ్యరతుల నమస్కారములఁ గైకొని ప్రతి నమ

స్కారముల నొనర్చరు అట్లు ప్రతినమస్కారము సేయుట
సంభవించెనేని నమస్కరించిన వారికి హానివాటిల్లును వేయేల!
నేను నమస్కరించితినేని గఠిన పాషాణమైనను బ్రద్దలై
శకలములగును.

నవా:— మహాత్మా! అనుపమాన మహిమాతిశయులైన తమనామా
క్షరము లెట్టివో యీ పాపపుఁజెవులకు వినుపించెదరా?

సిద్ధు:— సిద్ధుఁడందురు.

నవా:— ప్రసిద్ధమైనసిద్ధనామమును సార్థకము జేసికొనుచు, మముబోంట్లఁ
గృతార్థులఁ జేయుటకు దివినుండివచ్చిన సిద్ధపురుషునిఁగా మిమ్ము
భావించుచున్నాను. స్వామీ! తాము నమస్కరించినచోఁ
గఠిన పాషాణమైనను బ్రద్దలై శకలములగునని సెలవిచ్చితిరి.
అనుగ్రహించి యీనల్లరాతి నావిధముగఁ జేసి యీసేవకున
కానందము కూర్పఁగోరెద. దేవరమహిమను బరీక్షింపఁదలచిన
వానిగ భావింపవలదు.

( తనయెదుటనున్న నొకపెద్దనల్లరాతిబండను జూపును. )

సిద్ధు:— నీవు ధన్యుఁడవగుటకే నన్నిట్లుగోరినాఁడవని తలంచెదను.
కానిమ్ము. నీయభీష్టము దీర్చెదను

తే॥ గీ॥ వీరసద్గురుకృప గాంచి ♦ వెలయుశిష్య
జనులకుఁ గొఱఁతగల్గునే ♦ క్ష్మాతలమున
నట్టివో నీవుకోరిన ♦ యట్టులిపుడు
పగలకుండునె యీరాయి ♦ పార్థివేంద్ర.

(రాతికినమస్కరింపఁగా నది ఘనమైనధ్వనితో బ్రద్దలగును.

గులాం:— (రెండవభటునిజూచి) జాఫర్ ఈతఁడు మనఫకీరులనుమిం
చినమహిమగలవాఁడు. మనము తెలియక యీతని కెగ్గుజేసి
తిమి. (సిద్ధుని జూచి) సాధువర్యా! మేము మీయెడలఁ జేసిన
యపరాధమును క్షమింపవలయును.

నవా:— (సిద్ధునిజూచి) దేవా! తమయద్వితీయమైన మహిమను విను

తించుటకు నాకుక్షియందు బదములు లేకున్నవి. ఈదీనుని మీరు రక్షింపవలయును. నాయజ్ఞానము బాపవలయును అతికష్ట సమాక్రాంత సంసారసాగరమునఁ గూలి తరించుటకు దారి గానజాలకయున్న నన్నుఁ గృతార్థునిగాఁ జేయుఁడు. వీనిని శిష్యునిగా స్వీకరించుటకు సమ్మతింపుఁడు. నన్ను గూర్చి మీరన్యథాఁ దలంపవలదు

సిద్ధు:—

చ॥ తరుణుల మోము దమ్మి మఱి ♦ దర్పమెలర్పుచు నిక్కు చన్నఁగన్
మెరుగుల నీను మేనఁ గని ♦ మీసలు దిద్దుచుఁ బూరుషాళి. త
త్తరుణుల బాహువల్లరుల ♦ దప్పక చిక్కియు నాసుఖంబు లే
స్థిరమని యెంచి పొందుదురు ♦ తీరని బాధల జీవితాంతముల్.

ఉ॥ భూపకులాధినాథ! విరి ♦ బోఁడుల వాతెర తేనెలాని, సం
ప్రాపిత తుచ్ఛసౌఖ్యములఁ ♦ బాయక మేలని బుద్ధినెంచియున్
బాపపుఁ గార్యభారముల ♦ బంతిముతోఁ దలఁబూని కామినీ
శ్రీపద పంకజంబులకు ♦ సేవకులౌదురు మూర్ఖమానవుల్.

మ॥ పరమార్థుండగు నీశ్వరున్ మదిని సం ♦ భావింపఁగాలేక, యి
ద్ధర మిథ్యాసుఖభాజనంపు జలజా ♦ క్షీ మహాభోగ మం
దర లేకన్ నిజభావమూని తనువుల్ ♦ వ్యర్థంబుగాఁ జేసి, యీ
నరుఁడాత్మీయ వికాస మోక్షగతి, భూ ♦ నాథా! తొలగించెడున్.

చ॥ కనులకు దోఁచుఁ సర్వమును ♦ గల్లయటంచును నమ్మి నెమ్మితో
ననుపమ నిశ్చయాత్ముఁడయి ♦ యాసను గోసియు యోగనిష్టచే
మనమును బట్టి యీ త్రిగుణ ♦ మాయ జయించి, చిరంబును సువాఁ
డనఘుఁడటంచు, భూరమణ ♦ యార్యులు తెల్పిరి, శాస్త్రకృతులన్.

మ॥ ముని పాతంజలి యోగశాస్త్రమును సం ♦ పూర్ణార్థ సంవేద్యుఁడై
మనముం బట్టగ యోగమే యనుచుఁ దా ♦ మాన్యంబుగా సూత్రమో
జున పాలా లిఖియించెఁ గాన నదియున్ ♦ సామాన్యమై యొప్పనే
మనమున్ బట్టుటయన్న చిన్నపనియా ♦ మాటల్ వృథావ్యర్థముల్.

మ॥ పనిలే కింటనుగూరుచుండి, యచల ♦ ప్రాగల్భ్య వాక్యాళిచే
తను బ్రహ్మానుభవుండ నేనని యుపా ♦ ధ్యాయత్వముల్ బూనుచున్
ధనసంపాదనజేయు మూఢగురులన్ ♦ ధ్యానింప జన్మంబు ము
క్తినిధానంబునుగాంచు నాకనుము ధా ♦ త్రీనాథ చూడామణీ.

ఉ॥ సాధనసంపదల్ మనక ♦ సాధ్యమటంచ వివేకబోధనా
సాధన ముఖ్యమంచు నొక ♦ సామ్యముజెప్పుచు మోసగించు, దు
స్సాధులవాక్యముల్వినక ♦ శాంతిమనీషను యోగమార్గమే
సాధనజేసి మోక్షపుర ♦ సౌఖ్యము గాంచుట యొప్పుభూవరా.

మ॥ మలభూయిష్టము, పాపకార్యనిధియున్ ♦ మాయారమా మోహనో
చ్చలితస్థానము, శత్రువర్గగృహమా ♦ శాబద్ధ జీవచ్ఛవో
జ్జ్వలితంబున్ గడుదుఃఖ భాజనమునై ♦ నర్తిల్లు నీదేహమున్
గలనైనన్ నిజమంచు నమ్మదగదో ♦ భూపాల చూడామణీ.

నవా:— సిద్ధవర్యా! అమృతోపమానములగు మీవాక్యములు నన్ను జంచలములగు నిహలోక సౌఖ్యములనుండి, పరాఙ్ముఖునిగఁ జేయుచున్నవి. ఇఁక మిమ్ముల విడువను. మిమ్మాశ్రయించిన నన్ను ధన్యునిగాఁ జేసితీరవలయును.

సిద్ధ:— ఖానువర్యా! నీవు తొందరపడవలదు. నీకెవ్విధమైన బోధ సేయుటకును, మద్గురుండగు వీరేశ్వరస్వామి యనుజ్ఞ లేకపోవుటచే నేనశక్తుఁడను అమ్మహనీయుఁడు కతిపయ దినములలో శిష్యులతో దేశసంచారమై యీ ప్రదేశమునకు వచ్చును. అప్పుడు నీవాదివ్యపురుషుని దర్శించి కృతార్థుఁడవు కాగలవు. ఇది నిశ్చయము. నీవా భగవత్స్వరూపుని యాగమమునకై వేచియుండుము ఇఁక నే పోయివచ్చెదను.

నవా:— స్వామీ! అనుగ్రహముంచుఁడు.

(తెరవాలును)

ఇది ద్వితీయాంకము.



# వీరబ్రహ్మయోగి.

## తృతీయాంకము.

రంగము:— [ఆశ్రమములో వీరబ్రహ్మేంద్రస్వామియు - సిద్ధుడును ప్రవేశించుచున్నారు.]

వీర:— ఓహో! ఇదియా నీకుఁగలిగిన సందేహము! సకలభావముల నాత్మజ్ఞానముచేఁ దెలిసికొని భక్తులకాత్మయోగ ప్రదాతయై, సకలలోక నివాసియై సర్వమును గ్రహించుచు విసర్జించుచు నుండునుగావున నమ్మహాత్ముఁడు మహాదేవుఁడనఁబరగినాఁడు. మహాజ్ఞానయోగైశ్వర్యంబునందు సర్వమును విడిచి, వెలుంగును గావున మహాదేవుఁడయ్యెను. అతఁడు లోకమున కాదియందు జనించియు, జనిష్యమాణుఁడై, సర్వతోముఖుఁడై, లోకమున కెల్ల నేత్రప్రాయుఁడై సంచరించుచుండును. సకలమనంబుల వాలాగ్రమాత్రముగానుండి విశ్వదేవుండై, జాతవేదుండై యుండు నా దేవుని నెఱుంగువారలకు శాంతి శాశ్వతముగాఁ గలుగును. ఇతరులకుఁ గలుగదు సకలమునకు నమ్మహాత్ముఁడే కారణుఁడు. పంచభూతాత్మకమైన జగంబెల్ల నాతనివలనఁగలుగును. సకలభూతంబులయందు లింగభూతుఁడై యుండును. కామక్రోధ మోహ మదమాత్సర్యములను నరిషడ్వర్గములజయించి ఏకాగ్ర చిత్తులై, యెవ్వరు తన్నాశ్రయింతురో, యెవ్వరు తన్ను నిశ్చలానందముతోను, నిష్కళంకచిత్తముతోను, సేవింతురో యట్టి వారికెట్టి కొఱతయు నుండదు. ఆ దేవాది దేవుఁడు మనో

వాక్కులకలవిగానిరక్తంతరముబ్రహ్మానందమయుండై యుండును. అట్టిజగత్కారణు నెఱింగినవారలకుఁ గొఱఁత యేమియు నుండదు. వారికి ముక్తి కరతలామలకమైయుండును. భక్తులెల్లరును నాదివ్యపురుషుని నామమును జపించుచు, నాతనినే ధ్యానముసేయుచుఁ, దత్సాయుజ్యము నొందుచుందురు. దృశ్యమానములగు పదార్థములనెల్ల నాతని విభూతులై యుండును. అతనియందే సకలముజనించి, లయమునొందుచుండును. అతండణువులకణువై, మహాత్ముల కధికుఁడై, పురాణపురుషుఁడై సకలమునకధికారియై, హిరణ్మయుఁడై, వివిక్తరూపుఁడై, సత్స్వరూపుండై సకలము నెఱుంగుచుండును. వేదంబులాతని నెఱుంగును. అతఁడు వేదములయందు విహరించుచుండును. అతనికి బుణ్యపాపములు జన్మనాశనములు లేవు. నిష్కళంకుఁడును, నద్వితీయుఁడును, సమస్తసాక్షియునై యుండి, పరిశుద్ధమైన యాత్మతోనలరు. నా యోగిజన హృదయకమలాకర విహార రాజహంసుని; ఆ, సమస్తామరమణి కిరీటదీపిత పాదయుగళుని; ఆభక్తసంరక్షణదీక్షాబద్ధకంకణుని;ఆగిరిజామనోహరుని యాత్మస్వరూపం బెఱింగినవారలు తప్పక కైవల్యమును బొందుదురు.

సిద్ధు— గురువర్యా! తమ దివ్యబోధామృతరసం బెంత త్రావినను దనివి తీరకి యున్నది. మహాత్మా! మీరు సామాన్యులుగారు.

తే॥గీ॥ హరిహరాంశనుబూని యి ♦ ట్లవనియందు
జ్ఞానరహితులకు ఘన వి ♦ జ్ఞానమీయ
నవతరించిన మహనీయుఁ ♦ డంచు నిన్నుఁ
దలఁపవలెఁగాని, నరుఁడంచు, ♦ దలఁపరాదు.

మ॥ అరిషడ్వర్గములన్ జయించి, ఘన మా ♦ యామోహసంసార భీ
కర వారాసిఁదరించి, దుఃఖతర సౌ ♦ ఖ్యంబుల్ మదిన్ రోసి, నీ
చరణాంభోజ సుసేవఁగడఁగి శ ♦ శ్వద్భక్తి నీదివ్య బో
ధ, రహింగాంచినవాఁడె ముక్తిఁగొనఁగా ♦ ధన్యుండు వీరేశ్వరా!

వీర — సిద్ధా! ఈ వేదాంతబోధ కంతయు లేదు. (ఇంచుకయూరకుండి) భగవదారాధనకుఁ గావలసిన పుష్పములు, బిల్వదళములు సేక రించుకొని సత్వరముగ నరుదెంచెదవా?

సిద్ధు— ఆజ్ఞననుసరించుచున్నాఁడ. (నిష్క్రమించును.)

వీర— (తనలో) ఈ సిద్ధుఁడు పూర్వజన్మమున రెడ్డికులమున జన్మించి గోవధఁగావించి మదీయ శాపకారణమున నీజన్మమునఁ బింజారికులమునబుట్టి నాకు శిష్యుఁడయ్యెను. మదీయానుగ్రహమున నీసిద్ధుఁడు యోగసిద్ధుఁడయ్యెను. ఈతనికి మదీయ సేవయు దాసక్తి తప్ప మఱియొక వాంఛ లేదు. మనోవాక్కాయ కర్మంబుల నన్నే నమ్మియున్నాఁడు. పరమేశ్వరానుగ్రహమునకుఁ బాత్రుఁడగుట చేతనే, సిద్ధవటమునఁ దురుష్కసార్వభౌముని యెదుట నద్వితీయమైన మహిమను ప్రకటించి, యాతని విను తికిఁ బాత్రుఁడయ్యెను. నాయందువీనికి సంపూర్ణభక్తియున్నదనుట కావంతయు సందియము లేదు. కాని, నేను కనుపించకయున్న చో నీ 'నిచిత్తమెట్టి యారాటమునందునో యొక్కింత యరయవలయును.

( నిష్క్రమించును. )

సిద్ధుఁడు:— ( ప్రవేశించి ఇటునటుజూచి) ఇచ్చట మద్గురువర్యుఁడు లేడేమి! పుష్పములుగోసికొని సత్వరమ్ముగరమ్మని యాజ్ఞాపించి యింతలోనె మాయమగుటకేమి కారణము. (గురునినుద్దేశించి) స్వామీ! ఎచ్చటనుంటివి? నన్ను మాయజేసితివేల! ఈసిద్ధుడు నిజమైనభక్తుఁ డగునాకాదాయని పరీక్షించుట కిట్లొనర్చితివా? దేవా! నీవు నాహృదయమును బరీక్షింపనవసరము లేదు.

శా. కామక్రోధములన్ జయించి, మదిలో ♦ గర్వంబు వర్జించి ని,
న్నేమర్త్యుండు భజించునోయతఁడె పో ♦ నెంతైన ధన్యాత్ముడై

యామోక్షంబును బొందఁగల్గుననని, యు ♦ ద్యద్భక్తిరాజిల్లగా
నీమీఁదన్ మది నిల్పియుంచితిని తం ♦ డ్రీ! వీర యోగీశ్వరా.

శా॥ నీవే తండ్రివితల్లివీవె మఱి నీ ♦ వే ప్రాణ మిత్రుండవున్
నీవే సద్గురు శేఖరుండ విక నీ ♦ వే! నా సహాయుండవున్
నీవే యాపదలందు రక్షకుడవున్ ♦ నీవేసుమీ దైవమున్.
నీవేబ్రోవక యున్న నెవ్వరిని దం ♦ డ్రీ! వేడుదున్ జెప్పుమా.

నిన్నునమ్మిననన్ను వంచనసేయుటపాడిగాదు. నీదివ్యవిగ్రహాసందర్శనము జేసికొనని దినము నాకుదుర్దినము. అట్టిఘటిక విషపూరితఘుటిక. తండ్రీ! నన్నుఁగూర్చి సంశయింపక సత్వరముగ నీదర్శనంబొసంగి నాకానందమునుగూర్పుము. (ఇంచుకయూరకుండి) స్వామీ! పిలిచినఁ బలుకవేమి! రావా! నన్నుఁ గరుణింపవా! కావవా! సమస్తవిషయములనుబోధించుచు, నన్నుఁ గన్నకొడుకులకంటె నెక్కుడుప్రేమతోఁ జూచుచుందువే! అట్టిచో నన్నేలవిడిచి యరిగితివి. ఎంతపిలిచినను బలుకవేమి! దేవా! నీచరణసేవ లేకున్నచో నాకీదేహమునఁ బ్రాణములతో నేమి పనియున్నది. నిరంతరము నానయనములు నీదివ్యమంగళ స్వరూపమునే చూడఁగోరును. నాచిత్తము నిన్నుభజించుటకే కాంక్షవహించియుండును. స్వామీ! వీరేశ్వరా!

సీ॥ నీకట్టినవదలిన ♦ నిర్మలపుట్టంబు
నుత్తరీయంబుగా ♦ నంచుకొందు
నీమెడన్ వాడిన ♦ నిరుపమ పుష్పంబు
లతిభక్తిఁ గన్నుల ♦ నద్దుకొందు
నీదివ్యతరపాద ♦ నీరేజతీర్థంబు
శీర్షంబుపై వేడ్కఁ ♦ జిలికికొందు
నీమంగళాంగంబు ♦ నిరతంబు మదినిల్పి
మోక్షేచ్ఛ ముదమార ♦ మ్రొక్కుకొందు

తే॥ గీ॥ నీదు పాదుకల్ శిరముపై ♦ నిలిపికొనుచు
వాసిగా నాదుజన్మంబు సఫలతఁ ♦ జేసికొందు
నట్టిచో నన్ను విడనాడ ♦ న్యాయమగునె
దివ్యకృపఁబూని రావయ్య! ♦ దేశికేంద్ర.

(ఇటునటుజూచి) ఏమిది! నేనెంత ప్రార్థించినను గురుఁడు నాయెడలఁ గరుణవహించిరాకుండెను. స్వామీ! ఇంతనిర్దయవహించితి వేల! నేను నీయెడలఁజేసిన యపరాధమమయినఁగలదా! అట్టిది యున్నచో క్షమించి రక్షింపవలయును గాని యీరీతినాకు సంతాపము గూర్చుట భక్తజనరక్షణ పరాయణుఁడవగునీకు ధర్మమా! అక్కటా! ఇఁక బ్రయోజనములేదు. నాగురుఁడు నిశ్చయముగా నన్ను విడిచి యేఁగినాఁడు. ఎక్కడకేఁయననేల! శాశ్వితమైన సమాధినివంబూని యుండెనని తోఁచుచున్నది. ఇఁక నాకాదివ్యమంగళ స్వరూపునిదర్శించు భాగ్యములేదుకాబోలు! అమ్మహాత్ముని పవిత్రచరణకమలసేవ నాకు లభింపదుకాబోలు! హా! ఇఁక నేను జీవించినందువలనఁ బ్రయోజనమేమి యున్నది! మహోగ్ర క్రూరసంసార సౌఖ్యపరాఙ్ముఖుఁడనై యాశ్రయించిన యంతనే, తురుష్కుఁడని తలంపక నన్ను శిష్యునిగా గ్రహించిన యనుపమాన దయాభరితుఁడు; నిరక్షరకుక్షియైన నాకుఁ దనదివ్య మహిమచే సమస్తశాస్త్రార్థరహస్యముల నెఱుఁగజేసిన మహానుభావుఁడు; సిద్ధుని ప్రసిద్ధమహిమాతిశయునిగా నొనరింపవలయునని పలికి యట్లొనర్చిన దివ్యప్రభావసంపన్నుఁడు; అగు ఆగురుసత్తముని—ఆ వీరబ్రహ్మేంద్రస్వామిని నేనుచూడక నిలువఁగలనా! ఆర్తత్రాణపరాయణా నారాయణా! భక్తవశంకరా! శంకరా! భారతీనాయకా! చతుర్ముఖా! సమస్త బృందారకనాథా! పాకశాసనా! గగన ప్రచారమొనర్చుచు సర్వకర్మసాక్షివై యొప్పునో ప్రభాకరా! త్రిమూర్త్యస్వరూపా! మీరందఱును గటాక్షించి నాగురుండెచ్చట నున్నాఁడో తెలుపుఁడు. మీకెల్లరకును భక్తిపూర్వక వందనము లాచరించుచున్నాను. మద్గురు సందర్శనము సేయఁజాలనైతినేని నాప్రాణములునిలువవు. (ఇంచుక

యూరకుండి) వీరెవ్వరును నాయందుఁగరుణింపక యున్నారు. గురుని సందర్శనము లభింపనప్పుడిక నేనుమాత్రము జీవింపనేల! ఓప్రాణవాయువులారా! మీరు నాశరీరమునుండి లేచిపొండు. ఓయాకాశమా! నీవునాపైఁబడుము. ఓభూమీ! నీవునన్ను నలిపివేయుము. ఓయగ్నిభట్టారకా! నన్నుదహించివేయుము. వీరబ్రహ్మేంద్ర గురుకృపావర్ధిష్ణుఁడనై యొప్పు నేనాతనింజూడక జీవింపఁజాలను. అక్కటా! వీరికిఁగూడనాయందు దయలేకయున్నది. కానిమ్ము ఆకనఁబడు పాషాణమున నాశిరముబగుల గొట్టుకొని దేహముజాలించెద గాక. (ఎదుటనున్న యొకపాషాణమును సమీపించి)

మ॥ వరకారుణ్యకటాక్షవీక్షణ సుధా ♦ వారాశియై నన్నిరం
తరముం బ్రోచినపుణ్యమూర్తి; ఘనవే ♦ దాంతంబుసంపూర్తిగా
గరిమన్ దెల్పినసద్గురుం డఖిలో ♦ కస్తుత్యుఁడౌవీర స
ద్గురునిన్ జూపుము; లేకయున్ననను ను ♦ గ్గుంజేయుపాషాణమా॥

(తనశిరమును రాతిపైఁగొట్టుకొనఁబోవును)

వీర:— (ప్రవేశించి) ఆగుము, ఆగుము, సిద్ధా! ఈతొందరయేమి.

సిద్ధు:— మహానుభావా! ధన్యుఁడనైతిని. ఆనందమునుబొందితిని. మీదివ్యచరణారవిందసందర్శనమిఁక లభింపదనితలంచి జీవములఁ బాయుటకు సంసిద్ధుఁడనై యుంటిని. స్వామీ! మీదయలేకున్న నేనుజీవించియుందునా! ఈసిద్ధునిజీవితము వ్యర్థముకాదా!

వీర—సిద్ధా! నీకు నాపైన కుదిరిన నిశ్చలభక్తి కెంతయు సంతసించితిని. నీవు సర్వశుభంబులను బొందుదువుగాక! సకల మహిమా విరాజితుండగుదువుగాక!

సిద్ధు—మహానుభావా! తమ కటాక్షమున్నచో నాకుఁ గొఱఁత యుండునా?

వీర—సిద్ధా! శివపూజకు వేళయైనదికదా! అదియుంగాక, భోజనానంతరమున దేశ సంచారమునుగూర్చి మనము యోచించి, నేఁడో

రేపో బయలుదేరవలయును, రమ్ము. ఈశ్వరి నాకై నిరీక్షించుచుండును.

సిద్ధు—చిత్తము. (నిష్క్రమింతురు.)

రంగము:- పుష్పగిరి వీరబ్రహ్మేంద్రస్వామియు సిద్ధుఁడు, చిదానందుడు మొదలగు శిష్యులును ప్రవేసించుచున్నారు.

వీర—సిద్ధా! ఇదియేకదా పుష్పగిరి?

సిద్ధు— స్వామీ! వేదాంత తర్క వ్యాకరణ మీమాంసులగు విద్వాంసులచేతను, సాంగపరిచిత శ్రుతత్రయులగు శ్రోత్రియులచేతను, అశేషపురాణ వేత్తృతా సమ్యగధికులగు కథకులచేతను, అనుపమాన మాధురీధురీణ వాణీమధూమణీ విరాజితులగు కవులచేతను, బ్రజ్ఞాపాటవాస్యభావజ్ఞులగు దైవజ్ఞులచేతను, భాసిల్లుచుఁ బుష్పగిరి నామంబున నొప్పు నియ్యది యొక బ్రాహ్మణాగ్రహారము.

చిదా—ఇందందఱును బ్రాహ్మణులేయుండిరా?

సిద్ధు—అందుచేతనే యియ్యది బ్రాహ్మణాగ్రహారమని పేరొందఁబడుచున్నది.

(అంత రామశాస్త్రి జంధ్యమునొడుకుచు విష్ణుశర్మ, సోమావధాని, మొదలగువారితోఁ బ్రవేశించును.)

విష్ణు— ఇప్పుడు మనము పోవుట పొలమునకేనా?

సోమ—మఱి, యింకెక్కడికనుకొంటివి?

విష్ణు—తెల్లవారి లేచినది మొదలు మనకుఁ బొలమేయైనచోఁ వేదపాఠము లెప్పుడువచ్చును? ఈ వ్యవసాయపుబనులు చేయవలసినది శూద్రులుగాని మనముకాదు.

రామ—శర్మా! ఇదియా నీజ్ఞానము! నీవింకను ఆభాగములోనికి రాక

పోవుటచేతఁ దెలియలేదు. వ్యవసాయము శూద్రులకు మాత్రమేయని నిర్ణయింపఁబడియుండలేదు. ఇటువినుము. ఋగ్వేదమున నిట్లుజెప్పఁబడినది.

"శునం వాహాః శ్శునం నర శ్శునం కృషతులాంగలం"
ఇంద్రః సీతాం నిగృహ్ణాతు తాం పూషానుయచ్ఛతు
సానః పయస్వతీదుహా ముత్తరా ముత్తరాం సమామ్"

అనఁగా "వ్యవసాయ పశువులకు క్షేమమును, హాలికులకు క్షేమమును నొసంగుము. నాగళ్ళు చక్కఁగా భూమిని దున్ను గాక! వానచే పదనువడిన భూమిలో నాగటికొఱ్ఱు చక్కఁగా దిగునట్లు ఇంద్రుఁడు మమ్మనుగ్రహించుఁగాక! పూషణుఁడు నాగటిచాలును చక్కఁగానడిపించుగాఁక! పాలుగారెడియీభూమి యేటేట మాకుధాన్యరాసులు పితికి యిచ్చుఁగాక!" యనియే కదా యీ మంత్రముల యర్థము. వీనింబట్టిచూడ మన యార్యులకెల్ల కృషి యాధారమైయున్నదనుట నిస్సంసయము.

సిద్ధు—నిజము. నిజము.

"అక్షైర్మాదీవ్యః కృషిమిత్కృషస్వ
విత్తేరమస్వ బహుమన్యమానః
తేత్ర త్రిగావ, కితవ తత్రిజాయాహు
త్తన్మే విచష్టేసవితాఽయమర్యః."

అనిగూడఁ జెప్పఁబడియున్నది.

రామ:— (ప్రక్కంజూచి) వారెవరు? (తనవారింజూచి) వీరెవరో సాధువులవలెనున్నారు (సమీపించి) మీరెవరు?

సిద్దు:— (బ్రహ్మేంద్రస్వామినిజూపి) ఈమహానుభావుఁ డస్మద్గురుం డగువీరబ్రహ్మేంద్రస్వామి. కేమిరుపురమున నాయనశిష్యులము. నన్ను సిద్ధుఁడందురు. వైరాగ్యమంది యీ వీరగురుశిఖామణి

చరణకమలముల నాశ్రయించి హైందవమత ధర్మముల ననుసరించి చరించుచున్న తురుష్కుఁడను.

రామ:— ఏమీ! నీవు తురుష్కుఁడవా!

సిద్ధు— అవును.

రామ:— శివ! శివ! తురుష్కుఁడవైన నీవు నిగమములుగూడఁ జదువ సాగించితివా! 'రహీము'నువిడిచి మా దేవునిపైఁబడితివా!

సిద్ధు:— రహీమన్నను శివుడన్నను నారాయణుడన్నను నొకటే. ప్రధానవస్తువైన సువర్ణమనేక చిత్రవిచిత్ర భూషణములుగా మారుచందమున సర్వవ్యాపియైన భగవంతుఁ డనేకరూపములతో ననేకనామములతో భాసిల్లుచుండును ఈతత్త్వరహస్యమును గుర్తింపఁజాలక శివకేశవభేదములును దతితర దైవముల యందు భేదమును గల్పించికొనుటచేతనే మతసంబంధమైన వాదములు ప్రబలుచుండును. జగమునకంతకును బరమాత్మ డొక్కఁడే. అతఁడే శ్రీమన్నారాయణుడు. అతఁడే శివుఁడు. అతఁడే రహీము. ఏపేరుతో నెవ్వరిని గొల్చిననేమి! ఏమతమైననేమి మానవజన్మమంతయు నొకటికాదా!

రామ— కులగోత్రభేధముతోఁ బనిలేదా?

సిద్ధు:— తన్నుఁ దాఁదెలిసికొనిన వానికట్టిభేదములేదు బ్రహ్మజ్ఞానికి మతభేదముతో నేమిపనియున్నది?

రామ:— శూద్రులకు వేదమంత్రాధికారము లేదని శ్రుతులు చెప్పుచున్నవి. అట్టిచో మ్లేచ్ఛుఁడవగు నీవునిగమోచ్చారణ మేల సేయుచుంటివని యడుగుచుండ నేమేమో చెప్పుచుంటివి. నీమాత్రము మాకుఁదెలియదని యూహించితివా!

సిద్ధ:— సజాతీయ విజాతీయస్వగతభేద రాహిత్యమై యలరారు యాసర్వ భూతాంతర్గత తేజస్స్వరూపుండగు పరబ్రహ్మము

సర్వమానవులకు నొక్కఁడై ప్రకాశించుచుండును "భగవంతుఁడను" పదమునందర్థమును గ్రహింపుఁడు. భక్తిజ్ఞాన వైరాగ్యతత్త్వములఁ బ్రసాదించువాఁడే భగవంతుఁడు. ఆమహాత్మునకుఁ గులగోత్రభేదములతోఁ బనిలేదు. తను వేదవాక్యముల చేఁగాని మతియొకరీతినిగాని మూఢభక్తిచేఁగాని స్తుతించిన వారికెల్ల శుభంబులొసంగును. దానికి మతముతోఁబనిలేదు. ఉత్తమజ్ఞానియైనవాఁడు చండాలుడైనను నమస్కరింపఁబడఁదగినవాఁడే (ఇంచుక యూరకుండి) నేను తురుష్కుఁడననికదా మీరుచెప్పుచుంటిరి. చైతన్యస్వరూపుఁడైన ప్రత్యగాత్మస్వరూపము మీశరీరమందును, నాశరీరమందును, తదితరపిపీలికాది శరీరములయందును నొక్కటేవిధముననుండును. పరమపావనమైన గంగాంబువుల యందును చండాలవీధియందున్న జలమునందును నొకటేవిధముగ ప్రతిబింబించెడు సూర్యున కెట్లుభేదములేదో యట్లేప్రత్యగాత్మకు వీఁడు బ్రాహ్మణుఁడు, వీఁడుచండాలుఁడు వీఁడు తురుష్కుఁడు, అనుభేదములేదు (ఇంచుక యూరకుండి)మీరుసమస్త శాస్త్రముల నభ్యసించిన పండితోత్తములు. అపరబ్రహ్మలు. ఈవిషయము నేను చెప్పనక్కఱలేదు. కాని, మున్ను యతీశ్వరుండగు నాదిశంకరులు వారణాసికేగి, గంగాజలములందు స్నానము సేయుచుండగా, బరమేశ్వరుఁడు చండాలరూపమున వారిని సమీపించుటయు, నాస్వామి యామహానుభావుని దూరముగా దొలగుమనుటయు, నందుపైఁ బరమేశ్వరుఁడు వచించిన దివ్యజ్ఞానయుతములైన వాక్యములు విని, శంకరులేమి ప్రత్యుత్తరమిచ్చిరో యటవినుఁడు.

శ్లో॥ బ్రహ్మైవాహమిదం జగచ్చసకలం చిన్మాత్ర విస్తారితం
సర్వంచైతద విద్యయా త్రిగుణయాశేష మ్మయాకల్పితం
ఇత్థం యస్యదృఢామతిస్సుఖతరే నిత్యే పరే నిర్మలే
చండాలోస్తు సతు ద్విజోస్తు గురురిత్యేషా మనీషామమ."

ఎవఁడు నిత్యనిర్మలమైన పరబ్రహ్మ నేననిభావించి దృశ్యమగుచున్న జీవేశ్వరాదిభేదప్రపంచముసకలము మాయయని తలంచుచున్నాఁడో, వాడు చండాలుఁడైనను బ్రాహ్మణుఁడైనను నాకు గురువనికదా యాచార్యులవారి యభిప్రాయము. ఓ బ్రాహ్మణోత్తమా! సర్వ ధర్మశాస్త్ర పారంగతులగు మీరిట్టి భేద బుద్ధిని విడువుడు.

రామ — చాలుఁజాలు నీ వాక్ప్రౌఢికకింక బీగమువేయుము. మాకు వేదాంత బోధసేయ నవసరములేదు. తురుష్కుఁడవైన నీవు వేదంబుల నుచ్చరించినచో వినినవారికిగూడఁ బాపమొదవును. ఇంతకు నిన్ననవలసిన పనియేమున్నది? నిన్ను శిష్యునిగా గ్రహించి యిట్టివన్నియు బోధించిన నీగురుని నిందింపవలయును. మతధర్మముల నడుగంటఁజేయఁదలంచిన యీతని గురుత్వము నేమనవలయును!

చ॥ "ద్విజులకు నాగమాధ్యయన ♦ దీక్షఁ దపోనియమంబు, ధారుణీ
భుజుల క క్షేమభూమి ♦ జనపోషణ కార్యము, వైశ్యకోటి క
క్కజపుఁ గృషిప్రకృత్యము, జ ♦ ఘన్యజపాళికి దాస్యవృత్తిఁ బ
ద్మజుఁడు విధించెఁ దద్విధులు ♦ దప్పి చరింప నశంబె యేరికిన్."

చిదా:— అందుచేతనా! శూద్రుఁడు వేదపఠనార్హుండు కాడనిపలికిరి. వాల్మీకియు, వసిష్ఠుఁడును, మొదలగు బ్రహ్మఋషులు తొలుత బ్రాహ్మణులే కాబోలు! శాస్త్రిగారూ! ఈ విషయమైన చర్చ మీకును మాకును తేలునదికాదు. అనవసరమైన ప్రసంగముతో నేమి పనియున్నది భారతము జదివినమీరు ధర్మవ్యాధుని సంగతి మఱచిరా! ధర్మవ్యాధుఁడెవరు? కౌశికుండు బ్రాహ్మణుఁడు కాడా? కౌశికుఁడు ధర్మవ్యాధుని నాశ్రయించి సకలధర్మములు గ్రహించెను. కులమేదైననేమి! జ్ఞానముకదా ప్రధానము. అస్మద్గురుమూర్తులగు వీరబ్రహ్మేంద్రస్వామి యను గ్రహమున మాకు లభ్యముకాని దెద్దియును లేదు.

రామ:— మీగురుఁడే యింతవఱకుఁ దెచ్చినాఁడు మీకిట్టివి యుపదే
శించుట పాపమని యెఱుంగలేదు కాబోలు!

కII గురుఁడఁట మహిమలు గలవఁట
తురుష్కునకు వేదములఁట ♦ తోఁచకయుకటా
గురుతుగ వచించినాడఁట
హరి హరి యీ మాటవిన్న ♦ నార్యులు నగరే.

ఛీఛీ! మీరు మా పురంబున నుండఁదగరు- మీ గురువు
నకును, మీకును సరిపోయినది.

వీర:— (తనలో) ఈ వాగ్వాదము తుదకుఁ బెద్ద కలహముగాఁ
బరిణమించునని తోఁచుచున్నది.

సిద్ధు:— (కొంచెము కోపముతో) ఓభూసురవర్యా! వేదముజదువు
టకు నేనధికారినగుదునా- కాదా యను విషయమునుగూర్చి
మిమ్మడుగుటకు మేము రాలేదు. అట్టిచో ననవసరముగ మా
జోలిమీకేల! ఆపాపపుణ్యములన్నియు మమ్మెచెందును. మీ
సంభాషణనాపుడు. మీరు సద్గురుదూషణమునకుఁగూడ గడం
గుచున్నారు.

మII ప్రణుతాఖండ వివేకులయ్యును బరమ♦బ్రహ్మణ్యునిఁ దేవతా
గణినిన్ మద్గురు సత్తమున్విపుల గ ♦ ర్వంబేర్చి యీరీతి మీ
రణుమాత్రంబెద సంశయింపక మహా ♦ హంకారులై క్రూరభా
షణముల్ బల్కెదరేల! యట్లయినచో ♦ సైరించునే యీతడుఁ.

చిదా:— ఓ! ధరాబృందారకమణీ! మీకేల యీరీతి వితండవాద
ములు జేయుదురు. మీ బాల్యమునుండియు మిగులగష్టపడి
యభ్యసించిన విద్యలన్నియుఁ దుదకిట్లు బరిణమించుచున్నవి
కాబోలు!

"శ్లో॥ దాక్షిణ్యం స్వజనేదయా పరిజనే శాఠ్యం సదాదుర్జనే
ప్రీతిస్సాధుజనే నయోనృపజనే విద్వజ్జనేష్వార్జనం

శౌర్యంశత్రుజనేక్షమాగురుజనే నారీజనేధూర్తతా
యేచైవంపురుషాః కలాసుకుశలాస్తే ష్వేవలోకస్థితిః ॥

అని యార్యులు చెప్పియుండఁగా మీరాధర్మములను మఱచి సాధుదూషణకు గడంగిరేల! మావీరేశ్వరగురుని మీరు సామాన్యునిగా భావింపవలదు. జగతిని నుతిగన్న విశ్వబ్రాహ్మణకులమున మూఢజనుల యజ్ఞాన తమఃపుంజము వాప. హరిహరరూపమున నిట్లవతరించినాఁడు. సమస్తాగమ ప్రవీణత్వ భారతీభర్త; విమలశుచిత్త్వైక పర్యాయ శుక్రుఁడు; విపుల జపతపోయోగ గరిష్ఠుఁడు; ప్రబల ధరాన్వితుఁడు; సర్వసుమనః ప్రతాన సేవితుఁడు; అనుపమాన మహిమావిలసితుఁడు. ఈతని దివ్యమహిమలు జగంబునఁ బ్రాకియేయున్నవి. ఈ మహాత్ముఁడు మీ పూర్వ పుణ్యవశమున మీ యగ్రహారమునకు విచ్చేసెఁగావున గౌరవించి, యీయనవలన దివ్యజ్ఞానమును వడయుఁడు. తల్లిదండ్రులను, నాలుబిడ్డలను, నన్నదమ్ములను బడయవచ్చును. చతుర్దశభువనముల యందును జరింపవచ్చును. హరిహరులను సేవించి స్వర్గకైలాసములఁ బొందవచ్చును. కాని సాధుసమాగమము దుర్లభము. అట్టియెడల నీ వీరనారాయణ పరబ్రహ్మ; ఈ మతభేదరహితుఁడు; ఈ యాశ్రిత రక్షాచణుఁడు; ఈ యోగీశ్వరుఁడు; ఈజగత్కళ్యాణతేజుఁడు; మిమ్ములను గృతార్థులుగాఁ జేయుటకే వచ్చెనని తలంచుచున్నాము. కావున మీరు సంశయములనెల్ల నావలకు బాఱదోలి యీ లోకగురుని దివ్యచరణ సరసిజముల నాశ్రయింపుఁడు. ఇతఁడు దయామయుఁ డగుటచే, మీయజ్ఞానమును బాపును.

సోమా:— ఏమీ! విశ్వబ్రాహ్మణ కులసంభూతుఁడగు మీగురుని మేమాశ్రయింపవలయునా! ఎంతమాటఁ జెప్పితివి?

విష్ణు:— (రామశాస్త్రినిజూచి) గురువుగారూ! విన్నారా వీనిపలుకులు! వీరిగురువఁట! గొప్పమహిమగలవాఁడట! మనమాశ్రయింపవలయునట! ఎక్కడనైన నిట్టివింతలున్నవా! ఇఁక మనము వీరినిమన గ్రామమునుండి వెడలఁగొట్టవలసినదే.

రామ:— ఇంక దానికి సందేహమేల!

సిద్ధ:— ఓ బ్రాహ్మణులారా! విశ్వబ్రాహ్మణకుల పావనుఁడగు నీవీర నారాయణ పరబ్రహ్మనాశ్రయించుటకు మీకు సిగ్గగుచున్నది కాబోలు! ఈవిషయము నేను మీకింతకుమున్నే చెప్పితిని. అట్టిసంశయమును మీరు బొందనవసరము లేదు, ఇచ్చటమత ప్రసక్తియేమియు లేదు. ఏమతమైననేమి! ఉత్తమజ్ఞానసంపన్నుఁడును, మహాప్రభావముగలవాఁడునగు నీతనిని మీరేకాదు విబుధులుగూడ నాశ్రయింపవలయును: అంతియేగాని మతసంబంధమైనయసూయ మనంబునఁబెట్టుకొని, మేమధికులము మేమధికులము. మాకులమగ్రమైనదని యెవ్వరును గర్వింపరాదు. ఎవ్వరిని దూషింపరాదు. అవతార పురుషుండగుటచే నీజగద్గురుఁడగు వీరనాయణ పరబ్రహ్మమందఱకును బూజ్యుఁడే.

రామ:— (కోపముతో)

శా॥ ఔరౌరా! యిసుమంతభేదమును మీ ♦ రాత్మన్ విచారింపకే
యారాధింపుఁడు, వీనినంచుబలుకన్ ♦ న్యాయంబె; భూదేవతల్
సారాచారపరాయణుల్ సకలశా ♦ స్త్రజ్ఞానపారీణులై
ట్లారాధించెద రొక్క మూఢగురు ను ♦ ద్యద్భక్తిసంధిల్లగన్.

మీ గురుప్రభావము మీ నిగమపఠనమువలననే గ్రహించితిమి. దూదేకులవాఁడవగు నిన్నును, మఱి కులమేదోయైన వీనిని నిట్లే కొందఱిని శిష్యులుగా గ్రహించి మతభేదరహితులమనిపలుకుచు సమస్తధర్మములు నేలగలుపుచున్న మీ గురుఁడు జగద్గురుడా! ఇట్లు వచింపుమని యీతఁడుమీకుఁ జెప్పియుండెనాయేమి!

సిద్ధ:— కేవలము— మతసంబంధమైన యసూయమనంబున వహించిన మీకుమేము చెప్పఁజాలము. మీదారినిమీరుపొండు

సీ॥ సకలవేదాంతార్థ ♦ సౌధంబులందునఁ
జరియించు నెవ్వాఁడు ♦ సంతతంబు

భూరిచతుర్దశ ♦ భువనజాలంబుల,
భరియించు నెవ్వాఁడు ♦ ప్రకటమహిమ
తనుఁగొల్చుభక్త సం ♦ తతిమానసంబుల,
నివసించు నెవ్వాఁడు ♦ నిశ్చలముగ
మోహాది షడ్గుణం ♦ బులఁ జేరనీకుండ
హరియించు నెవ్వాఁడ ♦ హర్నిశంబు
తే॥గీ॥ లట్టి, పరమాత్ముఁడే యాత ♦ డంచు నమ్మి
వీరసద్గురు ఘనపాద ♦ సారసముల
నాశ్రయింపుచు ధన్యులై ♦ యలరుఁడయ్య
దూషణము లేల విపరీత ♦ భాషణముల.

వీర:—సిద్ధా! వీరితో మనకీయనవసర ప్రసంగమేల? (బ్రాహ్మణులం జూచి)

సీ॥ ఆకులు మేయవే ♦ మేకలు
సంచరింపవె నీట ♦ జలచరములు
పృథ్వీరుహంబుల ♦ వ్రేలవే గబ్బిలాల్
చెప్పిన బలుకవే ♦ చిలుకలెల్ల
వాయువుగ్రోలవే ♦ వ్యాళంబు లనయంబు
విపినవాసము సేయ ♦ వే మృగములు
ధ్యానంబు సేయవే ♦ తద్దయు బకములు
గుహల వర్తింపవే ♦ ఘోరిహరులు
గీ॥ జపతప స్నానసంధ్యలా ♦ సద్గతికిని
కారణంబులు దృఢబుద్ధి ♦ గాక త్రద
హస్య మరయజాలక యేల ♦ యార్యులెల్ల
సర్వ మతవివాదంబు నొ ♦ నర్తు రిపుడు మీరు?

ఇంతటితో మీరూరుకొనుఁడు. బ్రాహ్మణుల మనిగాని విశ్వ బ్రాహ్మణులమనిగాని గర్వించి పలికినంత మాత్రమున దివ్యజ్ఞానమున్న దని యెవ్వరును దలంపరు. అట్టి యర్థరహితమైన వాక్య మన్యమత ములయం దసూయ దెలుపును. ఇంతకును గేవల పరబ్రహ్మమును

సాధించి ముక్తిఁగైకొనఁదలంచిన వారికీమతములతో నేమిపనియున్నది? అట్టి పర బ్రహ్మమును సాధించుటయన్న మిముబోటివారికి సాధ్యమగు నదికాదు. దారాది కేషణత్రయంబును బరిత్యజించి, సత్త్వాది గుణ త్రియమును వదలి, తాపత్రయమును బరిత్యక్తముజేసి, మలత్రయ విమోచనముగావించి, మండలత్రయా గమ్యస్థలములు వెదకి, యంగ త్రియవ్యాపారము గ్రహించి, లింగత్రయాంతర్విలీనులైన వారికేయట్టి కార్యము సాధింపనగును.

రామ:— అట్టివన్నియు వింక నలువుర తురుష్కులను శిష్యులుగా గ్రహించి బోధింపుఁడు. మాకేమియు నక్కఱలేదు. ముందు మీయట్టివారు మాయగ్రహారమున నిలువరాదు. కావున శిష్యులతోఁగూడ నావలకు గౌరవముగాఁ బొండు.

సిద్ధు:— ఏమేమీ! మాయట్టివారిచ్చట నిలువరాదా! అనవసరమైన ప్రసంగము విడిచి యావలకుఁబొండు.

సోమా:— మేముపోవలయునా! మీరేపోవుదురో మేమేపోవుదుమో యిప్పుడే చూచెదరు.

సిద్ధు:— బలవంతముగా నావలకుఁ బంపెదరాయేమి!

విష్ణు:— మాటలతోఁ బోవకయున్నచో నిఁక జరుగవలసిన దట్టికా ర్యమేకదా!

చిదా:— అట్టికార్యమును మేము చూచియేపోవుదుము.

రామ:— ఏదీ! ఇఁకమీరు మీయడుగవతలకు సాగించి పిదప మాట లాడుఁడు. లెండు. లెండు. మాటదక్కదు.

(సిద్ధునిసమీపించును.)

సిద్ధు:— దూరముగా నుండుడు.

రామ:— మాయగ్రహారము విడిచి యావలకుఁ బొండని చెప్పుచుం డగా నట్లొనర్పక మూర్ఖులై యేమేమో పలుకుచుండిరేమి?

చిదా:— ఇందులో మూర్ఖులెవ్వరో మాటలవలనఁ దెలియుచునే యున్నది.

రామ:— (తనవారింగాంచి) ఇఁకవీరు మాటలవలన నావలకుఁ బోవరు. అర్ధచంద్ర ప్రయోగములే కార్యసాధనకుఁ దగినవి

విష్ణు:— గురువుల యాజ్ఞయైనచో నదియెంతపని! ఇదిగో చూడుడు ఇక నావలకు నడిచెదరా! లేదా! (సిద్ధుని మెడపైఁ జేయివైచి గెంటుచున్నాడు.)

సిద్ధు:— (కోపముతో) మీరింత సాహసకార్యమునకుఁ గడంగుచుండిరిగా! మేమింతవఱకును శాంతము వహించియుంటిమి. అస్మద్గురుని దివ్యప్రభావము మీరెఱుంగరు. జాజ్వల్యమానదావజ్వాలలశ్రమముగ హరింపవచ్చును. క్షీరసాగర సముద్భవమైన హాలాహలమును గుటుక్కున మ్రింగవచ్చును. నానాజగజ్జాల నాశనప్రక్రియో జ్వలమృత్యువుతోనైనఁ బెనంగవచ్చును. యమదోఃప్రకాండదీవ్యచ్చండదండమునైనవిఱువవచ్చును. కాని యీ వీరబ్రహ్మేంద్రగురున శ్చాగ్రహముగలిగించి యెవ్వరును బ్రతుకజాలరు. మీరు మాయెడల నెట్టి సాహసకార్యమైనను జేసితిరేని మీపుష్పగిరి నేలమట్టమైపోవును. ఈప్రదేశము భూతప్రేతపిశాచఢాకినీగణంబునకు గ్రీడాప్రదేశమగును.

రామ:— ఈ ప్రగల్భవాకములకు నిచ్చట భయముందువారెవ్వరును లేరు. (తనవారింజూచి మీరిక సైరింపవలదు. ఇఁకవీరి నావలకు బంపించుమార్గము చూడుఁడు.

సామా:— చూచుట కేమున్నది. నాలుగురాళ్లదెబ్బలుతగిలినచో వీరే యావలకుబోవుదురు. రండు.

(ముప్పురును నిష్క్రమించుచున్నారు.)

(బ్రహ్మముగారిమీదను- సిద్ధాదులమీదను, రాళ్ళుపడుచుండును.

సిద్ధు:— (బ్రిహ్మముగారనిజూచి) మహానుభావా! వీరెట్టి యకార్య మునకుఁ గడంగిరో చూచితిరా!

చిదా:— (మరలఁ దనపై రాయిపడఁగా) ఇదిగో! రాయి!

వీర:— ఆరాళ్ళు మనలనేమియుఁ జేయఁజాలవు. అవి యన్నియు మనకుఁ బుష్పములే.

[మరలఁ గొన్నిరాళ్ళుపడి పుష్పములై పోవును.]

వీర:— (ఎదుటఁజూచి బ్రాహ్మణుల నుద్దేశించి) ఓ బ్రాహ్మణులారా ఏల మీరీలీలఁ బ్రయాసమందెదరు! "సాధుజన సంతాపః కిమాశ్చర్యం కులక్షయం" అను నార్యవాక్యము మీరు మఱచితిరా!

చిదా:— (సిద్ధునిఁజూచి) సిద్ధా! గురువర్యుని నోటినుండి యెట్టి తీవ్రమైన వాక్యము వెలువడినదో వింటివా! ఇది మనపై దాడి వెడలివచ్చిన యీ మూర్ఖులపైఁ బ్రయోగించు ఘోరాస్త్ర మనియే తలంచెదను.

సిద్ధు:— సందేహ మేమి! (ఇంచుక యూరకుండి) ఎదుటఁజూచి ఆమంట లేమి!

(తెరలో)

రామశాస్త్రిగారూ! పుణ్యమునకుఁబోయినఁ బాపమెదురయ్యె ననునట్లు అయ్యో! చూచెదరేమి! రండు రండు- మన యగ్రహార మంతయు ననలున కాహార మగుచున్నది.

చిదా—పాపము! బ్రాహ్మణాగ్రహారమంతయు నగ్ని చుట్టుముట్టినది. మంట లాకాశము నంటుచున్నవి. (పరికించి) శివ! శివా! మంటలార్పుటకు ఘటంబులతో జలములుదెచ్చుచుఁ దొందరచేఁ బాదములు తొట్రుపడి కొందఱు నేలఁబడుచున్నారు. తమ బిడ్డల కెక్కడ హానియొదవునోయని కడురయంబునఁ

జంకఁబెట్టుకొని, యంగనలు బరుగిడుచున్నారు. దేవతా
ర్చన పెట్టెలకై గృహంబులఁజొచ్చి, వానింగైకొని ప్రాణం
బులఁ దక్కించుకొని యూవలఁ గొందరుపడుచున్నారు.

సిద్ధు—వారెంత ప్రయత్నించినను మంటలఁ జల్లార్పలేకయున్నారు.

చిదా—సాధుజనదూషణ మింతవఱకుఁదెచ్చినది.

సిద్ధు—(బ్రహ్మముగారినిఁజూచి) దేశికోత్తమా! ఆ బ్రాహ్మణు లెంత
యవస్థపడుచుండిరో వీక్షించితిరా!

వీర—సిద్ధా! ఎవరిపాపము వారనుభవింతురు. వీరినిజూచిన నాకు
మిగుల జాలియగుచున్నది. పాపమొనర్చినవారు తాముచే
సినకార్య మకార్యమని యెఱింగి పశ్చాత్తాపమునందినగాని,
కొంతవఱకుఁ దత్పాపమునకుఁ బరిహారముకలుగదు.

చిదా—(ఎదుటజూచి) ఎవరో బ్రాహ్మణులుకాబోలు రోజుకొనుచు
నిట్లు బరుగెత్తుకొని వచ్చుచున్నారు.

( రామశాస్త్రియు-విష్ణుశర్మయు-సోమావధానియు
బ్రవేశించుచున్నారు. )

రామ:—(బ్రహ్మముగారినిజూచి) ఓ మహానుభావా! నీవు జగద్గురుం
డవని తలంపలేక యజ్ఞానచిత్తులమై నీయెడల మహాపరాధము
గావించినందునకు దత్ఫలం బనుభవించితిమి. దేవా! అటుచూ
డుము. అగ్రహారమంతయు నగ్నిచే నావరింపఁబడి నామ
మాత్రావశిష్టమగుచున్నది. మే మొనర్చిన యపరాధమును
మన్నించి రక్షింపుము.

మ॥ అపరాధంబగునంచు నెంచక మదీ ♦ యంబైన దుర్బుద్ధిచే
విపరీతంబుగ జేసినాడను; భవ ♦ ద్విఖ్యాత కారుణ్య దృ
ష్టి పథంబందున మమ్ముఁబెట్టి యిక ర ♦ క్షింపంగదే ప్రొక్కెదన్
జపలుల్ వీరని యెంచకుండ జగదీ ♦ శా! వీర నారాయణా.

సీ॥ పాలింపుమీా, కొంప ♦ గూలెనటంచును
బెద్దపెట్టున యేడ్చు ♦ విప్రవరుల
రక్షింపుమీా, నిజ ♦ ప్రాణేశులంగూర్చి
పలవించు చుండిన ♦ పద్మముఖుల
కాపాడుమీా, వేగఁ ♦ గన్నవారినిఁగూర్చి
వెతుకులాడుచు నున్న ♦ సుతుల సుతల
బ్రోవంగ నెంచుమీా ♦ పుడమిపైఁ బరువెత్త
శక్తిచాలని వృద్ధ ♦ జనులఁసమితి
తే:గీ॥ మాయొనర్చిన దోషముల్ ♦మదినిమఱచి
సత్కృపనుజూడు మింకబు ♦వ్వగిరియెల్ల
భవ్యభవదీయ కరుణకుఁ ♦ బాత్రమాచు
నలరునట్టుల సేయుచు ♦ నమలచరిత.

విష్ణు:— ఓమహానుభావా! మేమునీయెడల నజ్ఞానులమై వర్తించితి మనుమాట మఱచి మమ్ముఁగాపాడుము. జాగుజేసినచోఁ బ్రయోజనముండదు. వీరనారాయణ బ్రహ్మమూర్తి త్రాణపరాయణుండని, కీర్తిడిండమము సర్వదిక్కుల మ్రోగునట్లు సేయుము.

సీ॥ అగ్రహారంబెల్ల ♦ నార్తనాదముతో
నిండుచుఁగళమాసి ♦ యుండకుండ
చిరకాలముననుండి ♦ చేర్చిదాచినగంధ
ములు మంటిలోపలఁ ♦ గలియకుండ
దివ్యమైయలరారు ♦ దేవతార్చన పేటి
కల్ నిప్పులోఁబడి ♦ కాలకుండ
బాఱుగాఁగట్టిన ♦ భవనంబులెల్లను
బెంపుదక్కుచునశి ♦ యింపకుండ
తే॥గీ॥ నింపుగావేగమమ్ము ర ♦ క్షింపుమయ్య
మాయొనర్చిన దోషముల్ ♦ మఱువుమయ్య

భవ్యభవదీయ సత్కృప ♦ బలుపుమయ్యె
గైకొనుమిదిగో నానమ ♦ స్కారమయ్యా.

సోమా:— యోగివర్యా! మముఁగటాక్షింపుము పుష్పగిరి యగ్రహారము శ్మశాన వాటికగఁజేయవలదు. అవివేకులమైనమమ్ము మన్నింపుము. నీవుసామాన్యయోగివి కావు. భగవత్స్వరూపుండవని మేమిప్పుడు గ్రహించితిమి. మమ్ము మీయాశ్రితులుగా గ్రహించి రక్షింపుము

వీర:— (తనలో) గర్వంబేర్చితొలుత బాపంబొనర్చి పశ్చాత్తాపమంది నాశరణముఁగోరుచున్న వీరియెడల నాహృదయము గఠినత్వము విడిచి కరుణవహించుచున్నది.

రామ-శా॥ లీలా నిర్మిత నైకకోటిఘన నా ♦ ళీకోద్భవాండచ్ఛటా
మాలాజాల విరాట్స్వరూపమగు నీ♦ మాహాత్మ్య మింతైన మే
మాలోకింపఁగ లేక సల్పితిమి నీ ♦ యందెగ్గు, మన్నించి, దు
ర్శీలురల్ వీరనకుండఁ బ్రోవుము దయన్ ♦ శ్రీవీరనారాయణా.

వీర— (బ్రాహ్మణులనుజూచి)

కం॥ పాపముజేసియుఁ బశ్చా
త్తాపము, నందినకతమునఁ ♦ దద్దయు శుభముల్
ప్రాపించును మీకునుగిరి
భూపతి కృపచేతనింక ♦ భూసురవర్యుల్.

బ్రాహ్మణోత్తములారా! మీ పు ష్ప గి రి మొప్పటయట్లైయున్నది. చూడుఁడు.

రామ— (చూచి) మహానుభావా! మీకనేకవందనములు. హరిహర రూపముదాల్చి యీరీతి నవతరించిన భగవంతుఁడవగు నిన్నేమని వినుతింపఁగలము? మీప్రభావ మత్యద్భుతమై యున్నది.

విష్ణు—నిజముగా నీవు భగవంతుఁడవు. గాకున్న నిట్టి దివ్యమహాత్మ్య మెంతైనఁగలదా!

సోమా—స్వామీ! ఇదియంతయు మాకొక వింతయగు స్వప్నముగఁ దోచుచున్నది. అగ్నిజ్వాలలచే నావరింపఁబడిఁ యాకాశమున కెగసిన మంటలు చల్లారుటేమి? దహింపఁబడిన సర్వగృహములు యథాస్థితినందుటేమి?

(తెరలో)

రామశాస్త్రీ! సోమావధానీ! ఆమహానుభావుని మనపురములోనికి దీసికొనిరా రేమి! భగవత్స్వరూపుఁడగు నాతనిని మనము విడిచిపెట్టరాదు.

రామ:— (బ్రహ్మేంద్ర స్వామినిజూచి) స్వామీ! తమ యాగమనమునకు బురివారెల్లరు వేచియున్నారు. తామరుదెంచి యిటఁగొన్ని దినములుండి మాయొనర్చుపూజలను గైకొనఁగోరుచున్నాము.

వీర:— ధరామరవంశాగ్రిణీ! ఒకసామాన్యుని నన్నింతో పెద్దగాఁ జేసెదరేల!

రామ:— మహాత్మా! నివురుగప్పిన నిప్పుచందమున నున్న నీప్రభావము నెఱుంగఁజాలక, యజ్ఞానులమై నీయెడల నపరాధము జేసితిమి. భగవత్స్వరూపుఁడవని యిప్పు డెఱుంగఁగలిగితిమి.

మ॥ సత్యజ్ఞానసుఖప్రదాయకము నీ ♦ శశ్వన్మహాత్మ్యంబు దా
నత్యంతాద్భుతమై పవిత్రకరమై ♦ యజ్ఞానవిచ్ఛేదమై
నిత్యశ్రీకరమై చెలంగు నిదిగో ♦ నిక్కంబుగానిప్పుడే
ప్రత్యక్షంబుగఁజూచినార మనల ♦ జ్వాలల్ నివారించుటన్.

మ॥ నుదుటన్ భూతినలంకరించి యఱుతన్ ♦ రుద్రాక్షలన్ దాల్చి లీ
లఁదలిర్పన్ భవదీయదివ్యమహిమల్ ♦ భక్తిన్ బ్రశంసించుచున్

ముదమొప్పన్ జరియించుసత్పురుషునిన్ ♦ మోహాతిరేకంబునన్
వదలంజాలదు ముక్తికన్యక సుభా ♦ వా! వీరనారాయణా.

శా॥ నీనిర్వ్యాతుకజాయమాన కరుణన్ ♦ నిష్కాముఁడై నీపద
ధ్యానాసక్తమనస్కుఁడై దురితబృం ♦ దధ్వంసియై దివ్యసు
జ్ఞానాత్ముండగుఁగాని మూఢుఁడు నిజే ♦ చ్ఛాలబ్ధశాస్త్రోద్భవ
జ్ఞానస్ఫూర్తిసి జ్ఞానియెట్లగును నీ ♦ శా! వీరనారాయణా

మ॥ ధనధాన్యాత్మజకామినీజనముపైఁ ♦ దథ్యంబుగానుండు ప్రే
మ నిమేషార్ధమ చంచలంబున భవ ♦ న్మాన్యస్వరూపంబునం
దునఁజిత్తంబును జేర్చియుండు నరుఁడాం ♦ దున్ దివ్యమోక్షంబు భూ
జనరక్షార్థనిజావతార జగదీ ♦ శా! వీరనారాయణా

విష్ణు:— స్వామీ! దయసేయుఁడు. పురంబులోనికిఁబోవుదము.

వీర:— (సిద్ధునిఁజూచి) సిద్ధా! మనయందింత గౌరవముంచి వీరిట్లు గోరుచున్నప్పుడు మనముబోవకయుండుట ధర్మముకాదు. (బ్రాహ్మణులనుజూచి) భూసురులారా! రండు.

(అందఱునిష్క్రమింతురు)

ఇదితృతీయాంకము.

# వీర బ్రహ్మయోగి.

## చతుర్థాంకము.

రంగము:—[పుష్పగిరిలో నొకగృహమందు వీరబ్రహ్మేంద్రస్వామియు సిద్ధుఁడు చిదానందుఁడు రామశాస్త్రి విష్ణుశర్మ సోమావధాని గోవిందశాస్త్రి మొదలగువారు ప్రవేశించుచున్నారు.]

గోవిం:— (బ్రహ్మేంద్రస్వామినిఁజూచి) యోగీశ్వరా! అమృతము స్రవించుచున్న మీవాక్యములు మాకపరిమితానందమును గలుగఁజేయుచున్నవి. మీయుపదేశమున నేనుసమస్తబాధ విముక్తుఁడనయితిని.

రామ:— దేవా! నీవు మాకుపదేశించిన తారకామనస్క యోగములును, నచలమార్గవిధంబును, మొదలగునవి యెప్పటికిని మాహృదయమును బాయవు

వీర:— ధరామర వంశభూషణులారా! శాస్త్రాభ్యాసమను పదమున కర్థమేమి! విజ్ఞానమార్జించుటయే జ్ఞానమునార్జింపఁజాలని శాస్త్రాభ్యాసము వలనఁ బ్రయోజన మేమియున్నది? తన్నుఁదాను తెలిసికొనినవాఁడేజ్ఞాని. అట్టిజ్ఞాని పరమతములను ద్వేషింపఁడు. బ్రహ్మజ్ఞానము వడసిన మహాపురుషుఁడు కులభేదమును బాటింపఁడు.

గోవిం:—వీర యోగీశ్వరా! భవదీయదివ్యబోధ నన్ను సంసారపరాఙ్ముఖునిగా జేయుచున్నది. ఇఁక నే నీసంసారపయోధియందుఁబడి

కొట్టుకొనజాలను. కావుననగుణించి నన్ను నీశిష్యునిగా గ్రహించి కృతార్థునిగాఁజేయుము. నీసన్నిధినుండెదను.

వీర:— బ్రాహ్మణోత్తమా! ఇట్టియూహ నీకేలజనించెను! గృహస్థుఁడవైననీవు నేనుచెప్పిన నియమములననుసరించివర్తించుచు భగవధ్యానమునఁ గాలముగడుపుము. పరమేశ్వరుఁడు నిన్నను గ్రహింపగలఁడు

గోవిం— స్వామీ! నీవట్లు సెలవీయవలదు. ఈ ఘోర సంసార సాగరమునబడి కొన్నాళ్ళుగొట్టుకొంటిని. సుఖమో, దుఃఖమో యనుభవించితిని. సంతానమువడసితిని. ఇంతకుమున్ననుభవించిన సౌఖ్యములుచాలును. ఇఁక సంసారము నిస్సారమని గ్రహించితిని. మీ యమూల్యకృపకుఁ బాత్రుడనై విజ్ఞానమార్జించి మోక్షసామ్రాజ్య పట్టాభిషిక్తుడయ్యెదను.

వీర— కానిమ్ము. పరమేశ్వరానుగ్రహమునకు బాత్రుడవయ్యెదవు గాక! (బ్రాహ్మణులందఱినిజూచి) భూమీసుర పుంగవులారా! మీరిన్నిదినములనుండియు నన్ను నీపురమునునిలిపి చేసినగౌరవంబునకెంతయు సంతసించితిని. ఇకమేమిచ్చటనుండి బయలుదేరుదుము. సాధుజనులకు దేశసంచారమావశ్యకమైయున్నది. భగవంతుడు ప్రసాధించినబుద్ధిని బ్రయోగించి యజ్ఞానమాయావ్యామోహితులై భగవచ్చింతనకు దూరులైయున్న మూఢుల కెట్లయిన జ్ఞానోపదేశమిచ్చి వారిని సన్మార్గమునబెట్టవలయును.

(తెరవో)

వీర బ్రహ్మేంద్రస్వామివారు విడిసియున్న గృహమెచ్చట!(ఇంచుకయూరకుండి)ఏమనుచున్నారు! ఆయెదుటనున్న గృహమున ననేకభూసురులచేఁ బరివేష్టింపఁబడి యామహానీయుఁడున్నాడనియా! సరే! నేనా యోగీశ్వరుని సందర్శించెదను.

వీర:— (సిద్ధునిఁజూచి) సిద్ధా! ఎవ్వరో నన్నరయుచు వచ్చుచున్నట్లు న్నారు పోయికనుఁగొనిరమ్ము.

సిద్ధు:— మహాప్రసాదము. (నిష్క్రమించి, వెంటనే రుస్తుంఖానునితో బ్రవేశించును.)

రుస్తుం:—(బ్రహ్మేంద్రస్వామినిజూచి) స్వామీ! సలాములు.

సిద్ధు:—గురువర్యా! ఈతఁడు సిద్ధవటము నవాబునకు మంత్రి. భగవత్సందర్శనార్థమై యరుదెంచెనట.

వీర:— ఖానువర్యా! అటఁ గూర్చుండుము.

రుస్తుం:— (ఆసీనుఁడగును.)

వీర:— (రుస్తుంఖానునిజూచి)

మ॥ పరమోత్సాహనిమగ్న చిత్తుఁడగుచుర్ ♦ భాసిల్లునే ప్రేఁడు; త
త్పరివారంబునకున్ సుఖంబె! ప్రజకుర్ ♦ భద్రంబె! రాజ్యంబు సు
స్థిర భాగ్యంబుల కాకరంబయి సదా ♦ చెల్వొందు నే! సాధువుల్
నిరతంబుర్ జనుదెంతురే నగరికిర్ ♦ వేజెప్ప మాలించెదర్.

రుస్తుం—మహాత్మా అందఱును కుశలముగనేయున్నారు. సిద్ధయోగీంద్రుఁడు మా నగరంబున కరుదెంచి తన మహిమఁ బ్రకటించిననాటనుండియు మా పాదుషాగారి చిత్తము మాఱిపోయినది. నేనమ్మానవేశ్వరుని యాజ్ఞననుసరించి మీసన్నిధి కరుదెంచినాడ. అతఁడు రాజ్యకార్యములన్నియు నావలకుఁ ద్రోసివుచ్చి మీదివ్యపద పంకేరుహ సందర్శనభాగ్య మెప్పుడు లభించునాయని, ఘడియ యొక్క యుగముగాఁ గడుపుచున్నాఁడు. సకలవిధములయిన భోగములను మఱచినాడు. స్వామీ! తామరుదెంచినచో సకలము దెలియఁగలదు. కావున మాయెడలఁ బరిపూర్ణ కృపాంతరంగులై యటకు విచ్చేయవలయును.

వీర—మీపాదుషాకు మాయందట్టిభక్తి కలిగినందున కెంతయు సంతోషము. మేమును నేడే యీ యగ్రహారమునుండి బయలు దేరఁదలంచు చుంటిమి

సిద్ధు—గురువర్యా! సిద్ధవట నగరపాలకుఁడు తమ కృపకుఁ బాత్రుఁడుగాఁదలఁచి యున్నవాఁడనుట కావంతయు సందియములేదు. తమ దివ్య పాదారవింద సేవఁజేసి కృతార్థుఁడు కాదలఁచిన యాతనిని మనము ముందుగఁ జూడఁబోవుట యుక్తమని నాయభిప్రాయము.

రుస్తుం—స్వామీ! తమ రవ్వోటికి విచ్చేయుటకు శ్రమ యొక్కింతయు లేకుండ హరులుగాని, కరులుగాని తేర వార్తఁ బంపెద.

వీర.— తురుష్క గేసరా! మాకట్టివేమియు నవసరములేదు. సాధుజనులకు వాహనాదులతో నేమిపనియున్నది! (బ్రాహ్మణులను జూచి) ధరామరవర్యులారా! మాయందభిమానముంచి భోజనానంతరమున మాప్రయాణమున కనుమతింపుఁడు. అదియుంగాక మీరెల్లరు మా వెంట సిద్ధవటమునకు రావలయును.

రామ:— ఇంతకంటె మాకుఁగావలసిన భాగ్యమేమున్నది లెండు. శివపూజకు వేళయైనది.

(తెరవాలును)

రంగము:— [సిద్ధవటము సభాభవనము ప్రవేశము నవాబు మంత్రియగు రుస్తుంఖానుఁడు వీరబ్రహ్మేంద్రస్వామి సిద్ధుఁడు చిదానందుఁడు రామశాస్త్రి గోవిందశాస్త్రి మొదలగువారును బ్రవేశించుచున్నారు]

నవాబు:— మీరు నేను పూర్వజన్మమునఁజేసిన సుకృతముచేత తాముగానాకు దర్శనంబొసంగిరి. కాకున్న చో దురుష్కుఁడను అజ్ఞానచిత్తుడను అగునాకడకు దయవంతి భగవత్స్వరూపులకు దెంతురా!

మ॥ పరమోదారగుణస్వభావులు సుమీ ♦ పద్మాయతాక్షీ నిజే
శ్వరతుల్యుల్ శ్రితబృందరక్షకులు శ ♦ శ్వత్కీర్తివిస్తారులున్
వరయోగీంద్రులునైన మీరలిటకున్ ♦ హర్షంబునన్ వచ్చుట
ద్దిరగంగానదిచౌటినేలపయిన ♦ ర్ధింబాఱినట్లేకదా

"మాతమిలేపణ తాతమిలేసుత భ్రాతమిలేయువతీ సుఖదాయి
రాజమిలే గజరాజమిలేసబ్ సహాజమిలేమన యిచ్ఛతిపాహి
సురలోకమిలే బిధిలోకమిలే వైకుంఠమిలే కైలాసకుజాయి
సుందరఅవరత సబహిమిలే పరసాధుసమాగమ దుర్లభభాయి"

స్వామీ! తమవంటివారుమావంటివారికిదొరుకుటదుర్లభము. నన్ను గృతా
ర్థునిఁ జేయుటకే తాము విచ్చేసితిరి. అజ్ఞానసాగరంబునమునిఁగి
ధనధాన్యదారాసుతాదులే శాశ్వతంబనితలంచి, చిత్తంబున భగ
వచ్చింతనంబున కొక్కింతయైన యెడమీయక యనేక దుష్కా
ర్యములాచరించి మహాపాపం బార్జించిన నాకు సత్పథంబును
జూపి రక్షింపుఁడు. ఈవిషయమునఁగూర్చి నేను మున్నే.
సిద్ధయోగీంద్రుఁడియ్యెడకరుదెంచినప్పుడు వేడుకొనియుంటిని
అమ్మహాత్ముఁడు దేవరవారియ్యెడ కరుదెంతురని చెప్పియుం
డెను. నేటికినాపుణ్యము ఫలించుటచే మీ దివ్యమూర్తిం దిల
కింపనోచితిని. ఇంక నన్ను మీదివ్యపాదాశ్రియునిగాఁ జేసికొని
రక్షింపుడు. (ఇంచుకయూరకుండి) స్వామీ! ఎంతవైరాగ్య
భావమవలంబించియున్నను నామనంబునకుఁగొన్ని సంశయములు
కలుగుచున్నవి. మావంటి యజ్ఞానులసంశయములఁ బాప నీవే
సమర్థుండవు.

వీర — ఖానువర్యా! ఎవ్వరికైన సభయందేదైన సంశయార్థముదోఁచిన
ప్పుడు, దానింగూర్చి సభ్యుల నడుగవలయును. సభ్యులును
దాని సంశయార్థమునకుఁ దగిన ప్రత్యుత్తరంబొసంగవలెను.

ఒకానొక సమయమున సభయందు దేవుఁడైనఁ దన
సంశయార్థము వెల్లడించినచో యందున్నవారిలోఁ గొందఱు
కోపస్వభావులగుదురు. కొందఱు అనూయవహించి, యేదో
తమకుఁదోచిన ప్రత్యుత్తరము నీయఁదలంతురు. ఇట్టి వనేకము
లున్నవి. వీనితోఁ మనకేమియుఁ బనిలేదు. సంశయముల
నెల్లఁ దెలియఁజేయుము. నాకుఁదోచినవిధమున నీకుఁ బ్రత్యు
త్తరమిచ్చి ముదముగూర్చెద. నీవు బుద్ధిశాలివగుటచేతనే
నన్ను నీ సంశయార్థములఁగూర్చి యడుగఁదలంచితివి.
కానిమ్ము.

నవా:—(సంతోషమునటించుచు) మహాత్మా! దైవ మెచ్చటదాగి
యుండును? అతని స్వరూపమెట్టిది? స్త్రీయా! పురుషుడా? ఇఁక
నొకసంశయము. స్వామీ! ఇతరుల యసువులఁదీసి, తన్మాం
సము భుజించుట పాపకర్మమా!

వీర:— నరపాలా! నీవుమంచిప్రశ్నమునే యడిగినాఁడవు. స్వప్రకాశ
మానంబగు పరమాత్మ స్వరూపమునే దైవమందురు. ఆపరమా
త్మస్వరూపము సకలస్థావర జంగమాత్మక ప్రపంచమునందంత
టను నిండియుండి సర్వదేహములయందును నెలకొనియుండును.
ఒకచోటనుండి మఱియొకచోట నుండడనితలంపరాదు. అట్లు
న్నచో సర్వాంతర్యామి యనుశబ్దము సార్థకము కాదు అట్టి
సకలవ్యాపియైన వాడొక్కడే దైవంబని పేర్కొనఁబడును.
అతఁడేపరబ్రహ్మము. ఆపరబ్రహ్మమును దెలిసికొనుట సామా
న్యులకలవికాదు. నాయీశ్వరతత్త్వము స్త్రీలయందును బురుషు
లయందును నీయందును నాయందును సమస్తజీవరాసులయం
దును నొకటేవిధముగనుండును. దానిని స్త్రీయనిగాని పురుషుఁ
డనిగాని యనఁజెల్లదు. దానికిస్త్రీత్వ పురుషత్వ భేదములేదు.
ఇట్టిరహస్యమంతయుఁ దత్త్వజ్ఞానమువలనఁ దెలియనగును. ఇక
మాంసభక్షణమునుగూర్చి చెప్పెదవినుము. జీవంబులవధించి

తన్మాంసమును దినుచు భోగియైయుండరాదు. మాంసభక్షణము దూష్యమని యార్యులు వక్కాణించియున్నారు. కానిధర్మరక్షణార్థము సమయముననుసరించి చేయుజీవహింస మాత్రము పుణ్యమును గూర్చునని శాస్త్రములయందుఁ జెప్పఁబడియున్నది. నిరర్థకముగ జీవహింస సేయుట న్యాయము కాదు. మఱియొక విషయము జెప్పెదవినుము. జీవహింసయొనర్చి దాని మాంసమును భక్ష్యమొనరించినంతమాత్రమున నాతఁడే యట్టి కార్యమునకుఁగారణుండనితలంపరాదు. సర్వమును బుట్టించుటకును రక్షించుటకును భగవంతుఁడేకర్త. ఐహికవాంఛలను సర్వముబరిత్యజించి యరణ్యములందుఁ గుటీరములనిర్మించుకొని తపము సేయుచుండు మహామునులే యాకనార్థమామిషమును భుజించుటకలదు. దానిచే జీవహింసాదోషము వారినిబొందియుండెనా! ఇట్లు జెప్పియుండెనని పలలాహారము ఘనంబనితలంపరాదు. దానివలన నాత్మకు మందభావమేర్పడును.

నవా:— మహానుభావా! మిమ్ము మఱియొకవిషయమును గూర్చియడుగుచున్నాను. సేవకుని మన్నింపుఁడు సర్వజీవ రాశులయందును నుండు తత్త్వమొక్కటియేయని తామువచించియుండిరికదా. అట్టిచో నీజాతిభేదము లేమి! భోజనాదివిషయములు వేఱైయుండనేల? ఈసందేహమును దయఁబూని నివారింపుఁడు.

వీర:— జాతియనునది భ్రాంతిమూలము. ఆత్మను నేజాతిలోఁ జేరినదానిగ నిరూపింతుము! కేవలము భ్రాంతిచేత నేయజ్ఞులు జాతిసంబంధమైన వివాదములకుఁగడంగుచుందురు. సర్వజ్ఞులు స్వప్నమునవైననిట్టి దానికిఁ గడంగరు నారుదీనిని బాటింపరు. సర్వముదెలిసిన విద్వాంసుఁడైన బ్రాహ్మణుని తక్కినవారిని నొకకేవిధమునఁ జూచును. వీడధికుండు వీడధముఁడు వీనిజాతిగొప్పది వీనిదధమము; అనిమూఢులు తలంచుచుందురు. ఇఁక మతమనునది యందఱికిని నవసరమైనదే. మహాత్మ్యసృష్టికంతకును గారణ మేదో

కనుంగొనుటయే మతము. తనగమ్యస్థానమును గ్రహించుటయే ముఖ్యమైనమతము. తానెవ్వఁడో తానుదెలిసికొనుట మతము ఇదియేయందఱికిని గావలసినమతము. దీనిని గ్రహింపఁజాలక, మూఢులు పెడత్రోవఁబట్టి యీర్ష్యాసూయాగ్రస్తులై చరించుచుందురు. ఇట్టిమతమునకు నిత్యానిత్యవస్తువిచారణ మావశ్యకము. ఏశాస్త్రములయందుఁ జూచినను నన్నిదేహములయందు నుండునది యొకవస్తువేయని తెలియుచున్నది. దీనిని గాదని యెవ్వరును వాదింపలేరు.

నవా:— మహానుభావా! నామనంబునంగల సంశయంబుల నివారించితిరి.

రామ:— (తనలో) అబ్బా! భోజనపు వేళగూడ యతిక్రమించుచున్నది.

విష్ణు:— (బ్రహ్మేంద్రస్వామిని జూచి) స్వామీ! శివపూజకు వేళ మించుచున్నట్లున్నది.

నవా:— (తనలో) వీరుభోజనము వేళదాటుచున్నదని సూచించుచున్నారు. నిశ్చయముగా వేళమిగిలినది (ప్రకాశముగా బ్రహ్మేంద్రస్వామినిజూచి) స్వామీ!

తే॥ గీ॥ మిట్టమధ్యాహ్నమయ్యె న ♦ మేయచరిత
దైవతార్చనవేళయు ♦ దాటిపోయె
శారిహస్తాబ్జ(?) మోములన్నియు ♦ వాడఁదొడఁగె
నోగిరం బారగించుట ♦ యొప్పుగాదె.

దేవరవారితో సాహసించి విన్నవించుకొనుచున్నందులకుమన్నింపుఁడు. మీదివ్యబోధచే గొంచెము తెలివిఁగాంచినవాఁడనగుటచే మిమ్ము ప్రార్థించుచున్నాను. కావున మీపదసేవకుఁడనగు నాకోరికను భంగముసేయక మీరీవచ్చినవారితో నేనొసంగు ప్రసాదమును స్వీకరింప వేడుచున్నాను.

వీర:— (నవ్వుచు) తురుష్కకులదీపా! ఇందభ్యంతర మేమియున్నది. నేనింతవఱకుఁ జెప్పినసంగతి యిదేకదా! సభయందు నేదేనివిష యముగూర్చి చెప్పినవాఁడు చెప్పినట్లుమాత్రము చేయఁడు. అట్టి వాఁడు నిందకు బాత్రుఁడగును. బరులకు జెప్పినట్లు చేయువాడే ధన్యుడు కావున నేనిందున కావంతయు సందియము నొందను. నీయభీష్టముదీర్చుటకు నేను సంసిద్ధుడనై యుంటిని. వీరందఱు గూడ నట్లె యొనర్తురు.

నవా— (మంత్రినిజూచి) మంత్రిపుంగవా! సత్వరంబుగ వివిధభక్ష్య యుతమైనభోజనంబు నిటకు దెప్పింపుము.

రుస్తుం— (నిష్క్రమించును.)

రామ:— (విష్ణుశర్మనుజూచి రహస్యముగా) ఇదియంతయు వింతగా నున్నది.

విష్ణు:— నేనును నదియే యాలోచించు చున్నాను. (రుస్తుంఖానుఁ డిరువురు మహమ్మదీయులచే వస్త్రములచేఁ గప్పఁబడియున్న భోజన పళ్లెములఁ బట్టించుకొని ప్రవేశించును. మహమ్మ దీయులు తాము తెచ్చిన పళ్లెరములను అచ్చటనున్న వారి ముందుఁ బెట్టుదురు. నవాబొక పళ్ళెరమును స్వయముగా నందుకొని బ్రహ్మేంద్రస్వామి ముందుబెట్టును.)

నవా:— ఓ మహానుభావులారా! మీరెల్లరు నామెడలఁ గరుణించి మత్ప్రసాదము స్వీకరింప సమ్మతించినందున సలాము సేయు చున్నాను. (బ్రహ్మేంద్రస్వామిని జూచి) స్వామీ! కాలాతీత మయినది.

రామ:— (విష్ణుశర్మతో) అయ్యో! ఇదియేమి! నేడు తుఱకలకూడు దినవలసి వచ్చినది.

సోమా:— వీరందఱికి కులహాని గలిగినప్పుడుకదా మనకుఁగూడ గలుగును.

విష్ణు:- శాస్త్రిగారూ! ఇప్పుడు మన మేమియు మాటలాడ రాదు. అన్నము పరబ్రహ్మస్వరూపమని వేదములయందుఁ జెప్పఁబడి యున్నది కదా?

గోవిం:— ఈ సంశయమును మీరావంతయుఁ బెట్టుకొనవలదు. నిగ్రహానుగ్రహ సమర్థుఁడయిన వీరేశ్వరగురుని యానతికన్న మన కుఁగావలసినది మఱియొకటిలేదు. పరబ్రహ్మ స్వరూపుఁడగు గురుఁడే యారగింపఁ దలంపఁగా మనకు సందియమేల కలుగ వలెను!

వీర—(తనలో) ఈ బ్రాహ్మణోత్తములెల్లరును బలలాహారమునె ట్లు గైకొందుమాయని దీర్ఘాలోచనము సేయుచున్నారు. వీరి సంశయము వారింపవలయును. (ప్రకాశముగా)

మ॥ ఇతఁడా మ్లేచ్ఛుఁడు, మాంసమిద్దియకటా ♦ యేరీతినాచారమున్
క్షితిలోఁగల్పి భుజించువారమనుచుర్ ♦ జిత్తంబులో నెంచకే
శితికంఠార్పణమంచుఁ బల్కుచు గుణ ♦ శ్రీభాసిలర్ వేగమే
కుతుకంబార భుజింపుఁడీ యిఁకను, మీ ♦ కుంగల్గు గల్యాణముల్.

ఆత్మవేదులగు మీరు హిందూ మహమ్మదీయ భేదమును బాటింపవలదు. ఈవిషయమును గూర్చియేకదా నేనింతకు మున్ను చెప్పియుంటిని. ప్రపంచమంతయు బ్రహ్మస్వరూపము. సంశయింపక సత్వరముగా నారగింపుడు.

[ అందఱును తమతమ ముందు బెట్టఁబడిన పళ్లెరములమీఁదఁ గప్పఁ బఁడిన వస్త్రములను దీయుచున్నారు. ఫలలము పండ్లు మొద లగునవిగా మారుటఁగని యాశ్చర్యము నటించుచున్నారు. ]

రామ—బ్రాహ్మణులారా! ఈవిచిత్రమేమి? ఇదియంతయు వీరేశ్వరుని మహిమ. కాకున్న నిట్లగునా! అమ్మహానీయుఁడు పలలము దినవలసివచ్చెనుగదాయని మనమందుచున్న యాందోళనము

గ్రహించి యిట్లొనర్చినాడు. అద్వితీయప్రభావముగల యీతఁడు నిజముగా భగవంతుఁడేయనఁదగును.

నవా— (ఆశ్చర్యమునందుచు దనలో) ఆహా! నిశ్చయముగా నియ్యది మాయగానున్నది.

వీర—తురుష్కాగ్రణీ! అనేకవిధములగు నీ దివ్యఫలములన్నియు మాకొఱకెక్కడనుండి సంపాదించితివి? భోజనమునకు వేళమిగిలినదనితలంచి మాకావంతయు శ్రమకలుగకుండ నందఱికిని నుపయోగమైన ఫలాహారమును దెప్పించిన నీయభిమానమునకెంతయుసంతసించితిని.

(అందఱును ఫలాహారములను భక్షించుచున్నారు.)

నవా— (బ్రహ్మేంద్రస్వామినిజూచి) స్వామీ! నీమహామహిమ వినుతించుటకు నాకుక్షియందుఁ బదములు లేకయున్నవి. పలలాహారమునుగూర్చి మీరుచెప్పగా నందఱును నయ్యది స్వీకరింతురుగదాయని దానిందెప్పింప నయ్యదిఫలములుగా మార్చినాడవు.

వీర— తురుష్కసార్వభౌమా! నీయభీష్టముననుసరించి నీ నగరంబునకరుదెంచితిని. నీసంశయంబులెల్ల వారించితిని. నీవుమామొదలఁ జూపినగౌరవంబునకు మిగుల నానందమందితిని. ఇఁక గావలసినదేమున్నది! మేమిఁకనరిగెదము.

నవా— స్వామీ! మీరరిగెదరా! మిమ్మువిడిచిపెట్టుటకు నాచిత్తము సమ్మతించునా? దేవా! నాకీ రాజ్యముతోబనిలేదు. ఈభోగములు ఈసౌఖ్యములువలదు.

మ॥ తురగస్యందన మత్తసామజభట ♦ స్తోమాది దివ్యాంబరా
భరణామూల్య సువస్తుసంచయముపై ♦ భ్రాంతుల్ దలంపక భవ
చ్చరణాంభోరుహచింతనామృతరస ♦ స్వాదోలసచ్ఛ్రీపరం
పరచే నొప్పెడు భాగ్యశాలికిఁ దృణ ♦ ప్రాయంబు వీరేశ్వరా.

కావుననేనుకూడ- ఈసర్వమును విడిచి మీపదములుగొలుచుచు నరుదెంచెదను. అనుమతినీయుఁడు.

వీర.— మహాహ్మాదీయవంశదీపా! నీవట్లు చెప్పదగదు. నీవు నరపాలు
డవు. ప్రజలకు తండ్రివంటివాడవు. నీవు రాజ్యమువిడిచి మా
వలె జరింపరాదు. పరమేశ్వరానుగ్రహమున నీవు సర్వశుభంబు
లను బొందగలవు.

శా॥ శ్రీకల్యాణగుణాకరుండు సురసం ♦ సేవ్యుండు నిత్యుండు లీ
లాకారుండ ఖిలాంతరంగుడభవుం ♦ డాద్యుండనంతుండు సు
శ్లోకుండాశ్రిత భక్తపాలకుఁడు ♦ త్రైలోక్యప్రభుండైన, గౌ
రీకాంతుండల శంకరుండు నిను ♦ రక్షించుఁగా దురుషాగ్రణీ.

ఉ॥ ఆయతబాహు విక్రమస ♦ మార్జిత వంశపరంపరాగత
శ్రీయుతరాజ్య వైభవముఁ ♦ జెందిన నీవిక ధర్మరక్షణో
పాయవిధుండవౌచుఁ బరి ♦ పాలనసేయుచు నుండుమయ్య దీ
ర్ఘాయుకుపేతకీర్తి జను ♦ లందఱు మెచ్చఁ దురుష్క భూపతీ.

ఉ॥ జాతిమతాదిభేదముల ♦ సాంగముగా విడనాడి యాత్మసం
జాతులరీతినెల్ల రను ♦ సాకుచు శిష్టజనావనంబు దు
ష్టాతతి శిక్షణంబు వెల ♦ యఁగా ధరణీతల మేలుమయ్య నీ
ఖ్యాతి ప్రశస్తమౌను సుగు ♦ ణాకర! ఖానుకులాబ్ధిదీపమా.

సీ॥ ధర్మంబెయాతప ♦ త్రముగాఁగ సర్వప్రజానురాగంబె సిం ♦ హాసనముగ
సజ్జనాశీస్సులే ♦ చామరంబులుగాఁగ న్యాయవృత్తియె కృపా ♦ ణంబుగాఁగ
దశదిశవ్యాప్తమౌ ♦ యశమెధనంబుగా సత్యంబెదివ్య ధ్వ♦ జంబుగాఁగ
రారాజులజోహారు ♦ నీరాజనముగాఁగ నవిరళతేజంబు ♦ దివిటిగాఁగ

తే॥ గీ॥ నఖిలజనమనోవీధుల ♦ హర్షమెసఁగ
నిత్యమునుబట్ట భద్రత ♦ నెగడుచుండి

ధరణిబాలింపుమా ♦ చంద్రతారకముగ
భవ్యసద్గుణదీప భూ ♦ పాలచంద్ర.

నవా— స్వామీ! మీరట్లు శెలవిచ్చిన నేనేమనువాఁడ. అట్లయిన మీరు శిష్యసహితముగా నీపురంబునందే యుండుడు. అహర్నిశలు మీ పదసేవజేసికొనుచు నేనుధన్యుడనయ్యెదను.

వీర— ఖానువర్యా! నీకు మాయందట్టి యభిమానమున్నచో భవత్పాలితప్రదేశమున నెలకొనియున్న కందిమల్లయపాలెమున మఠమేర్పఱుచుకొని యుందుందును. అందునకు దగినప్రదేశము నొసంగుము.

నవా— మహానుభావా నేనుమీకీయనలయునా! సర్వముమీయదియే! నేఁడే నాసచివుని తమవెంటఁ బంపెదను, తమకు గావలసిన యేర్పాటు నతఁడు చేయును.

వీర— మంచిది. నేమాప్రదేశమును గూర్చి చనెదను.

నవా— మహాప్రసాదము,

(తెరవాలును,)

ఇది చతుర్థాంకము.

——:o:——

# వీ ర బ్ర హ్మ యో గి.

## పం చ మాం క ము

రంగము:—కందిమల్లయపాలెమున ఇరువురు పౌరులు ప్రవేశించుచున్నారు.

మొ-పౌ—మన భాగ్యవశమున బ్రహ్మేంద్రస్వాములవారు మన గ్రామమున మఠము నిర్మించుకొనియున్నారు. వీరీప్రదేశమున నడుగుబెట్టినది మొదలు క్షామబాధలు, మొదలగునవి యేమియు లేక ప్రజలెల్లరు సుఖముగా వర్ధిల్లుచున్నారు.

రెం-పౌ—అవతారపురుషుఁడగు నాతఁడున్న ప్రదేశమున నేవిధమగు కొఱఁతయైననుండునా? ఆ మహనీయుని నామస్మరణము జేసినంతమాత్రమున సర్వజాడ్యములు హరించుచున్నవి. సర్వాభీష్టములు దీరుచున్నవి.

మొ-పౌ—ఆ దివ్యమంగళస్వరూపుని ప్రతిదినము, నుదయమున దర్శనము జేసికొనువారలకుఁ బాపములు దూరమగును.

రెం-పౌ—నీవు చెప్పినమాట నిశ్చయమే కాని మనకాభాగ్య మెల్లుండి దినమునుండి యుండదు కదా!

మొ-పౌ—అట్లు చెప్పుచుంటి వేమి?

రెం-పౌ—ఇంకను నీవు వినలేదా? విశేషములు!

మొ-పౌ—లేదు. నేను నాలుగు దినములనుండి గ్రామములో లేను. నేడే వచ్చినాను.

రం-పా:- ఆ మహనీయుఁడు భూమిపై నవతరించి, చేయవలసిన కార్యములు ముగిసినవఁట. అందుచే నెల్లుండి దినమున జీవస మాధిం బ్రవేశించునఁట. ఆవిచిత్రమును జూచుట కనేక గ్రామములనుండి జనులు వచ్చునారు.

ము-పా:- ఆహాహా! ఆమహానుభావుఁడీఁక జీవసమాధినిఁ బ్రవేశించునా! అతఁడు మనలఁబాసి పోవుచున్నందునకు విచారింపవలసినదే కాని జీవసమాధిఁ బ్రవేశించుట సామాన్యుల కలవి కాదు. కేవల పరబ్రహ్మయే యతఁడగుటంజేసి యిట్లొనర్చుచున్నాఁడు. ఇఁక మనమంచిచెడ్డలు, వారిపుత్రులును మనుమరాలగు నీశ్వరాంబయు, శిష్యులును విచారింతురు. కానిమ్ము ఈ రెండురోజులును బ్రహ్మముగారిసేవయందుండి కృతార్థులము కావలయును రమ్ము- (ఇరువురు నిష్క్రమింతురు.)

రంగము [మఠము: ప్రవేశము-వీరబ్రహ్మేంద్రస్వామి-గోవిందయ్య-పోతులూరయ్య-ఈశ్వరి-సిద్ధుఁడు-గోవిందశాస్త్రి-గోవిందమాంబ-ప్రవేశించుచున్నారు]

వీర:— (ఈశ్వరింజూచి) అమ్మా! ఈశ్వరీ! నీవు సాక్షాత్పరమేశ్వరివి మద్విరచితమైన కాలజ్ఞానమును బ్రకటింప నీవయుక్తురాలవు. అందు నాచేవ్రాయఁబడిన ప్రతివిషయము ముందు జరిగితీరు. (ఇంచుకయూరకుండి సిద్ధునిఁజూచి) సిద్ధా! నియమిత లగ్నమాసన్నమగుచున్న కావున మాసమాధిని సిద్ధపరచితివా!

ఈశ్వ:— సర్వమునుసిద్ధపరచితిని. (ఇంచుకయూరకుండి)

సీ॥ నిర్మోహమనుభూతి ♦ నింబెట్టి సమభావ
కౌపీన వసనంబు ♦ గరిమఁదాల్చి
సత్యకమండలిఁ ♦ జక్కఁగాఁ జేపట్టి
సత్కృపారసమును ♦ జలముబోసి

దాయలార్వురను రు ♦ ద్రాత్ముల బంధించి
'విజ్ఞానపాదుకల్ ♦ వేడ్కదొడగి
సంసారమనెడు ని ♦ స్సార కాననము వి
రాగ పరశువున ♦ ద్రచ్చివైచి

తే॥ గీ॥ సచ్చిదానందమూర్తివై ♦ జగమునందు
భక్తకోటిని రక్షించి ♦ ప్రబలి, నేడు
మమ్ము విడనాడిజీవ స ♦ మాధియందె
జొచ్చెదవె గురుమూర్తి! వి ♦ శుద్ధకీర్తి.

గోవిందయ్య:— తండ్రిగారూ! ఇంకమాకు దివ్యబోధనెవ్వరు గావింతురు?

పోతు:— జనకా! మీరులేకున్న మేమెట్లు నిలువగలము.

గోవిందశాస్త్రి:— స్వామీ ఈశిష్యున కేమిమార్గము జూపుదురు.

సిద్ధు:— దేవా! నాగతియేమి!

వీర — మీకు నేనొర్చిన మాయందేహమునుగూర్చిన బోధయంతయు మఱచి యిట్లు విచారించుచుంటిరా! ఇది విచారమునకు సమయముకాదు. మహా సంతోషమును బొందవలసిన సమయము (సిద్ధునిజూచి) సిద్ధా! నీవు ముడుమూలయందు మఠమేర్పఱచుకొని యందుండుము నీకు జీవసమాధియోగము లభించుగాక! (గోవిందశాస్త్రినిఁగాంచి) బ్రాహ్మణోత్తమా! నీవు గోవిందస్వామినామంబుననొప్పుచు చిడుగురాళ్లపల్లియందు మఠము నిర్మించుకొని యందుండుము. (ఈశ్వరింజూచి) తల్లీ! ఈశ్వరీ! నీవు మద్విరచితమైన కాలజ్ఞానము లోకులకు బ్రకటించుచు మహామహిమతో రాజిల్లగలవు. నిన్ను జగదీశ్వరియగు నీశ్వరిగాదలంచి భక్తిమైపూజించు వారఘంబులబాసి సర్వశుభంబులను బొందుదురు. (పుత్రులజూచి) జ్ఞానపూర్ణులయిన మీరు జగంబున సద్బోధగావింపుడు. సకలవిషయములెఱింగిన మీ

జనసికి నేను చెప్పవలసినది యేమియు లేదు. ఇక నాకు సమాధిం
ప్రవేశించుటకు వేళయైనది. (లేచి సమాధి సమీపించి యందు
బ్రవేశించును.) (అందరు హా! వీరబ్రహ్మ దేశికేంద్రా! అని సం
తోషధ్యానములు సేయుదురు.)

వీర:— సర్వంఖల్విదంబ్రహ్మ,"

సిద్ధు:— (చేతులుజోడించుకొని సమాధింజూచుచు)

దండకము.

శ్రీమన్మహాదేవ చిద్రూపదీపాసురేంద్రాది దిక్పాలసంపూజితాం
ఘ్రిద్వయా యద్వయా! హేత్రిలోకేశ, యీశా, లసద్రత్నకేయూర
హారాళి శోభావిశేషద్యుతీవక్ష, దుష్టాత్మశిక్షా, జగద్రక్ష, హస్తాంబు
జోభాస రుద్రాక్షమాలా, సుఫాలా, లలాటోజ్జ్వలద్వీతిహోత్రా,
సునేత్రా, సుషుమ్నాంతవిద్యోత, పూర్ణేందుసంకాశ, తేజస్స్వరూపా,
విదూరీకృతానేకభక్తాళిపాపా, త్రిమూర్తిస్వరూపా, సదానందభాజా,
శ్రితానీకవాంఛాసుగీర్వాణభూజా, మహోదార, యోగీశహృత్పద్మ
సంభావనానామమంత్రాక్షరా, అక్షరా, వేదవేదాంత శాస్త్రాటవీమధ్య
సంచారపాదా, వరాళిప్రదా, భూరిధైర్యైకనిష్ఠాగరిష్ఠా మితోత్కృష్ట
నిర్మోహసత్కర్మసంధాయకా, విశ్వవిశ్వంభరానాయకా, కేవలాధ్యా
త్మికాభోగనిర్మోహకామాది షడ్వర్గసంసర్గవిచ్ఛేదకా, నిర్మలోంకార
సింహాసనాధ్యక్షకా, సర్వభూతప్రియోద్వేలకారుణ్యపీయూష వృష్ట్యో
దయా, ధూతమాయా, సహస్రార నిరేజమధ్యస్థకింజల్క సంవేష్ట్య
సప్తాంతిసందోహబిందూర్ధ్వభాగస్థితామోద, ఓంకారనాదానుసంగీత
సంవేదితానంద వార్ధినిమగ్నాత్మ, గాంభీర్యధీరా, నిరాకారసారా, జగ
చ్ఛ్రితకల్యాణ, నిర్మాణవైశద్యసామర్థ్య దృగ్దీక్షవిస్తారజేగీయ, చిత్తా,
సుశబ్దావళీ భోధనాసక్తవక్త్రా, విధాతాది నారాయణేశాదిమూర్తీల
సత్కామితార్థీ, నిరాభాస నిర్లేపనిర్ద్వంద్వ నిస్తైజసీవ్యక్తప్రభాఖండహృ
త్కంజసామ్రాజ్య సంస్థాన రాజేశ్వరా, దేవ, భూమీశ్వరా, పార్శ్వ

భాగోల్లసద్భారతీ భార్గవీహస్తసంవీజితా చామరోద్భూతశీతానిలాహ్లాద, భూయిష్టసంఫుల్లహృత్పద్మ, గోవింద మాంబా మనోనాయకా, నాదసంధాయకా! నీదివ్యమహాత్మ్యమెన్నంగ, భారతీనేతకైనఁవశంబే, చిదానందరూపా, తదీయాంఘ్రులంగొల్చు భక్తాళినింబ్రోవగా, దుష్టులన్ గూల్పగా, లోకముఁ మంచిమార్గంబునంబెట్టగా నిట్టిరూపంబునన్ బుట్టినావోమహాదేవ, నిన్నుఁ మదిన్నమ్మియున్నట్టివారిఁ గృపన్ మహాజ్ఞానులంజేసి, నిష్ఠాగరిష్ఠుండవై యోగముఁ బూని యిందుం బ్రవేశించియున్నట్టి నిన్నుఁ సదాగొల్చుచున్ నీయాలయంబున్ప్రకాశించుచున్ బ్రశంసంచుచున్ నీకథల్ గానముఁ జేయుచున్ గంది మల్లయ్యపేటన్ ముదంబారగా జేరువారిఁ దయన్ జూచుచున్, సదాగాచుచున్, గోర్కులన్ దీర్చుచున్, నీమమాహాత్మ్యముఁ జూపుచున్ రాణదీపింపుమో దేవ శ్రీపోతులూర్వీర నారాయణా వేదపారాయణా, సర్వయోగీశ్వరేశా! నమస్తే నమస్తేనమః.

ఈశ్వ:—

—* మంగళహారతి *—

శ్రీపోతులూరు వీరయోగిచంద్ర - దివ్యమంగళమ్॥
పరమభక్తకోటినెల్ల నేలనీవిథిఁ
ధరణినవతరించినట్టి - దైవరాయ - నీకు ॥మంగళమ్॥
సకలజనులు మిగుల సన్నుతింపఁగా।
కందిమల్లయ పురిని వెలసిన - గరళకంఠ మంగళమ్॥

(తెరవాలును)

ఇది పంచమాంకము.

సంపూర్ణము.



# తప్పొప్పుల పట్టిక.

| తప్పు | పుట | పంక్తి | ఒప్పు |
|---|---|---|---|
| దేవప్పాయా | (కృతిప్రశంస) | | దేవఃపాయా |
| మర్తుల్ | ,, | 6 | మర్త్యుల్ |
| దురం | 3 | 16 | ధురం |
| పేర్కొస | 3 | 23 | పేర్కొన |
| విశ్వబ | 4 | 8 | విశ్వబా |
| మెంతయు | ,, | 9 | మెంతయును |
| బూ | ,, | 11 | భూ |
| చీలుకలు | ,, | 20 | చిలికలు |
| బుధు | 7 | 6 | బుధ |
| శాశ్వత | ,, | 10 | శాశ్వత |
| రసస్సంభూతమై | ,, | 14 | రసమునన్ సంభూతమై |
| తేటగములు | ,, | 22 | తేటిగములు |
| ప్రిజలను | 8 | 17 | ప్రజల |
| ధన్యుండనై తింక | 25 | 19 | ధన్యుండనై యుంటి |
| కనుల | 31 | 10 | కనుగవ |
| శాశ్వతంబులె | ,, | ,, | శాశ్వతంబులె |
| శ్లో॥ జగదోన్మయ | 34 | 6 | జగదున్మయ |
| వితావమును | ,, | 10 | వితానమును |
| త్వపాల | 44 | 12 | త్వ్మాపాల |
| నాదుజన్మంబు | 49 | 2 | జన్మ |
| భూపతి | 65 | 19 | జాపతి |
| కామసీ | 67 | 7 | కామినీ |
| దయ్యోదను | 69 | 12 | దనయ్యోదను |

| తప్పు | పుట | పంక్తి | ఒప్పు |
|---|---|---|---|
| దారా<br>శాశ్వ | 72 | 11 | దార<br>శాశ్వ |
| స్వ | 74 | 9 | సర్వ |
| సప్కాం | 84 | 20 | సత్కాం |
| తదీ | 85 | 4 | త్వదీ |
| వినూ | ,, | 6 | నిన్నూ |
| నినూ | ,, | 8 | నిన్నూ |

(ఇంకను నక్కడక్కడగల యచ్చుతప్పులను చదువరులు గమనించి చదువుకొనవలయును)



